# విషయసూచిక

కాకతీయ గణపతి దేవుడు
మంత్రి యుగంధరుని మంచితనము
గాలవ మహాముని కథ
సత్యవంత మహారాజు కథ
సుమతీ శతభానుల దాంపత్యము
మహా పతివ్రతా ప్రభావము
కదిరి నరసింహ దేవాలయము
ఆచార్య పురుషులు
లక్ష్మీ నరసింహాలయము
ప్రాకార వైభము
విశ్వామిత్రముని ప్రతిజ్ఞ
ముని మాయా పరిభావము
హరిశ్చంద్రుని సత్యపాలన
భవనాశనీ పుష్కరిణీ మహాత్మ్యము

# యాదగిరి క్షేత్ర మహాత్మ్యము

## మునులాడిన ముచ్చట్లు

పూర్వం చాలాకాలం క్రిందట నైమిశారణ్యంలో సూతముని యుండేవాడు. ఆయన మహాతపస్వి—గొప్ప చదవరి. పద్దెనిమిది పురాణలలో తెలియనిదంటూ లేదు. ఎక్కడడిగితే అక్కడ తడుముకోకుండా సూటిగ చెప్పగల పాండిత్యము, జ్ఞాపకశక్తి. సామర్థ్యము లాయనకు పుట్టుకతో వచ్చినవిద్యలు పురాణం వినేవారుంటే యేడుపగిళ్ళు యేడురాత్రు లైనా విసుగు విరామం లేకుండా చెప్తాడు. ఆమునీంద్రుడలాగా చెప్పుకుపోతూంటే వినేవారికి ఆకలి నిద్రలు కూడా తెలియవు. అందుకనే ఆయన నందరూ సూతపౌరాణికుడంటారు.

ఆ నైమిశారణ్యంలో యింకా శౌనకుడు మొదలైన మునులెందరో యున్నారు. ఒకనాడు వారంతా వారివారి దినచర్య లన్నింటిని ముగించుకున్నాక పురాణం వినాలని యుబలాడపడ్డారు. అవన మందున్న ముని లెవరైనస్నానసంధ్యాదులలో, జపతపాదులలో తక్కువవారుకారు. చదువు సంస్కారాలు తెలియని వారుసుకారు. కాక పోయినా సూతముని పురాణం

చెబుతూంటే వినాలనే ఆసక్తికలుగుతుంది. ఈనాడు వారా సూతమునా శ్రమా నికి పోయింది పురాణం వినాలనే.

ఇంటికి వచ్చిన మునులను చూచిచూడడంతోనే సూతమునిలేచి వారి నందరను పరామర్శించి తగిన మర్యాదలతో కూర్చుండబెట్టిన తరువాత సావధానముగ "మునీంద్రులారా! నేడు మీరందరు మాయింటికి వచ్చినందుకు నేనుచాల ఆనందపడుతున్నాను, వచ్చినవారి అభిమతం తెలిసికొని వారి సంకల్పం నెరవేర్చిపంపడం యింటి యజమాని ధర్మం. మీరు దయచేసిన పనేదియొవివరించినయెడల నాకు చేతనైనంత దనుకచేసి మిమ్మ సంతోషపెట్టటానికి సిద్ధంగా వున్నాను. కావునమీరు సందేహింపక నావలన కావలసినదేమిటో సెలవీయండి" అన్నాడు.

సూతముని మాటలకు మహానందం చెందిన మునులంతా "మహనీయా మీరన్ని పురాణములు తెలిసినవారు. నిరంతరం పరమేశ్వరు నారాధించుచున్న పరమభాగవతోత్తములు. పురాణం మీనోట మృదుమధురంగ పలుకుతూంది. మీవలన మేమీనాడు వేదగిరి మాహాత్యము నంతయు సాంగోపాంగముగవిన కుతూహలమొంది యిటువచ్చాం. దయవుంచి మా ప్రార్థనను తోసిపుచ్చక వేదగిరి యేర్పడిన విధానము, వేదగిరి స్వరూపము, వేదగిరి మీద నృసింహస్వామి వేంచేసి వున్న వివరము, వేదగిరి యందలి క్షేత్రములు, ఆలయములు, తీర్థములు వాని ప్రభావములు మొదలైన వానినన్నింటిని పూసగ్రుచ్చినట్లు వివరించి మాయభిమతం బీడేర్పు"డని వినయంబుగ ప్రార్థించారు.

సూతమునియు సంతసించి "అయ్యలారా! వేదగిరి నరసింహమూర్తి మహిమలు మీకు తెలియనివికావు. కాకపోయినను నానోట వినదలంచి మీరిం

దరు పనిగట్టుకవచ్చి యడిగినపుడు నేను కాదనరాదు. మీరందరు మీకు నాయందున్న గౌరవాభిమానాలతో నన్నొక పెద్దను చేయుచున్నారు కాని నిజానికి నేను మీకంటే తెలిసినవాడనని నేననుకొనుటలేదు. ఐనను చెంతకు వచ్చిన వారిని చిన్నపుచ్చరాదను తలంపున నాచేతనైనంత వరకు నేనా వేదగిరి పురాణము నంతయు చెప్పగలను. నేను మాగురుదేవులైన శుకయోగీంద్రుల వారి నుండి వినినవేకాని కల్పితముల నేమివు చెప్పను. నరసింహమూర్తిని గురించి యికచెప్పగల దింతకన్న లేదన్నంతగా చెప్పగల ప్రజ్ఞ నాకుచాలదు. నాకావచన రచన నాపరమేశ్వరుడే ప్రసాదించును గాక.

ప్రప్రథమంబుగ యీ వేదగిరి చరిత్రము నంతయు బ్రహ్మదేవుని వలన నారదుడు విన్నాడు. బ్రహ్మమానసపుత్రుడగు నారదమహాముని వలన అగస్త్యుడాలకించినాడు. సప్తసముద్రాలలో నీటినంతా నరచేతనే పోసన బట్టిన అగస్త్యముని వలన భృగువు తెలిసి కొన్నాడు. అరకాల కన్ను కలిగిన భృగుమహర్షివలన సహస్రాసన ప్రభుపు గ్రహించాడు. పాండవ వంశము వాడైన సహస్రాసన మహారాజేంద్రుని వలన దేవేంద్రుడు విన్నాడు. ముక్కోటి దేవతలకధిపతియైన దేవేంద్రుని వలన నాకు సంక్రమించిన యీ వేదగిరి పురాణము నేను మీకు తెలుపుచున్నా"నంటూ శౌనకాది మునులను సూతపౌరాణికుండిట్లు చెప్పాడు.

# కుంభ వికుంభులు కూలిన కథ

అది ప్రళయకాలం. అంటె ప్రపంచం మీద చెట్టుచేమా, పురుగు బుట్రా, రాయిరప్పా యేవీ లేకుండ జలమయమయిన సమయం. అది భగవానుడు నిద్రపోయే కాలమంటారు. బజారులో వస్తువులను పరచి అమ్మకునే వ్యాపారి చీకటిపడగానే వానినన్నింటిని తనమూటలోనికి సర్ది కట్టివేసి—తిరిగి మరునాటి ప్రొద్దున వానిని అంగడిలో బయలుపరచు చున్నటులనే భగవంతుడు ప్రళయకాలంలో జీవరాసుల్ని—అంటే యీజగాలనన్నింటిని తన కడుపులో పెట్టుకొని మఱ్ఱియాకుతో పండుకొని నిద్రపోతుంటాడు. ఆయన నిద్రపూర్తికాగానే యోగమాయ శ్రీహరి చెవులనాశ్రయించి వుండి మేల్కొలుపుతుంది. అక్కడ నుండి మళ్ళీ సృష్టి ప్రారంభమవుతూంటుంది. యిప్పటికెన్నో ప్రళయాలు జరిగిపోయాయని మనపెద్ద లంచనా వేసి చెప్పారు.

మహావిష్ణువు నిద్రలోనుండగ వాని బొడ్డునుండి తామరకాడ పుట్టింది. తామరతూటుచివర పూవుపూచింది. అందులో నుండి ఐదుతలల బ్రహ్మదేవుడవతరించి పరమేశ్వర సంకల్పంతో సృష్టిచేయ బూనుకున్నాడు. బ్రహ్మదేవుని తలలైదంటె అవి సృష్టికవసరమైన భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అనే పంచభూతాలు. ఈమైదు లేకుండా యేవస్తువూ పుట్టదు. ఐతే శివుడనే యింకొక గొప్పాయన యింకొక మాటన్నాడు. నేల నిప్పు నీరు మనకంటికి కనుపిస్తున్నాయి. ఒక్కొక్కపుడు గాలిగూడా కనపడుతుంది.

కాని బ్రహ్మదేవుని యైదవతలనే ఆకాశం మాత్రం అసలులేదు. అలాగా యేమీ లేనిదానిని చెప్పాలంటే దానికో పేరుకావాలి కనుక ఆబయలునే ఆకాశ మన్నారు. అందుకే గగనం శూన్యమంటారు. కనుక మిన్ను అనే దానికి మేనులేదని బ్రహ్మదేవుని యైదవతలను ఖండించాడు కనుక బ్రహ్మ నాలుగు ముఖాల వాడయ్యాడని మనవారు చెప్పుచున్నారు.

అప్పుడే ప్రపంచం మీద కుంభనికుంభులనే యిద్దరు రాక్షసులు పుట్టు కొచ్చేరు. బహుశవాండ్లకు అహంకారం మమకారం అనేవి మారుపేరులై యుంటాయేమో? బ్రహ్మమీద తారసిల్లి "సృష్టిచేయడం నీకేంచేతనవుతుంది? మేం చేసిచూపిస్తాం. నీవక్కడనుండి లేచిపో"మ్మని దాడి చేశారు. వారి నెది రించే శక్తిలేని బ్రహ్మదేవుడు బయపడిపోయాడు. నారాయణుని మొరపెట్టు కుందామని పోయాడుకాని ఆయన బహుతెరుంగని నిద్రలో నున్నందున యిర కాటలో పడవలసి వచ్చింది. బ్రహ్మపడుతూన్న బాధసంతా అర్థంచేసుకొనిన యోగమాయ హరిని నిద్రమేల్కొలిపింది. జరిగినదంతా తెలుసుకున్నాక శ్రీహరి రాక్షసుల మీద యుద్ధానికి బయలుదేరాడు. కుంభనికుంభులకూ నారా యణునకూ చాల భయంకర పోరాటం జరిగింది.

ఏ విధంగానూ శత్రువులు చచ్చేలాగున కనపడ నందున విష్ణువుకు గూడా యేమిచేయాలనే యోచన యేర్పడింది. అదంతా గమనిస్తూనే యున్న యోగమాయ మహామాయా రూపంతో రాక్షస సోదరుల నావరించింది. గర్వం పెరిగిపోయినందున వారు "ఓయీ! నారాయణా! నీకు కావలసిన వరమేదైనా వుంటే మమ్మడుగు యిచ్చేస్తాం. దానిని తీసుకొని నీదారిన నీవు పో. మాతో

పగ నీకు మంచిదికా" దన్నారు. ఇప్పుడు హరికి మంచి అవకాశం లభించింది. వెంటనే "మీరిద్దరూ నాచేతితో చనిపోయేలాగా వరమీయండి" అన్నాడు. ఇది తిరిగి మాటయిచ్చిన దానవులకే చేటుతెచ్చింది. ఐనప్పటి నీవారు వెనుకాడక "హరీ! నీరులేని చోటున నీవు మాయిద్దరినీ చంప వచ్చు" నన్నారు. అపుడింకా యెచటను నేల కనరాని నీటి మయమైనందున నారాయణుడు వారిద్దరనూ తన తొడలమీద పరుండబెట్టుకొని చంపడంతో బ్రహ్మదేవుని భయం తీరిపోయింది.

## మత్స్యావతార మహిమ

బ్రహ్మదేవుని నోటినుండి వెలువడిన మాటలు వేదవాక్యము లయ్యాయి. వేదమనగ బ్రహ్మస్వరూప మనవచ్చు కూడ. బ్రహ్మ విజ్ఞాన మంతా పెరిగి పెరిగి కొండరూపం దాల్చింది. భరద్వాజ మునీంద్రుడా వేద రాశి నుండి మూడు గుప్పెటలు తీసుకొని మూడువేదాలను చేశాడు. ఆతరువాత బాదరాయణు డా మూడు వేదాలను నాలుగు వేదాలుగా మార్చాడు. ఋగ్, అధర్వణ, యజు, సామవేదాల నాల్గింటిని వ్యాస శిష్యులైన పైల, వైశంపాయన, జైమిని, సుమంతు లను వారు ప్రపంచ మంతటా వ్యాపింప చేశారు.

మొదటి ఋగ్వేదం చాలగొప్పది. పైలముని దానిని విస్తరింప చేశాడు. రెండవ యజుర్వేదాన్ని వైశంపాయనుని శిష్యుడైన యాజ్ఞవల్క్యముని రెండు

భాగాలుగ విడదీశాడు. వానిలో కృష్ణ యజుస్సుకు తైత్తరీయ మని శుక్ల యజ స్సుకు వాజపేయమనియు నామము లేర్పడినై. అథర్వణ వేదాన్ని సుమంత ముని బహుళ ప్రచారం చేశాడు. సామవేదాన్ని జైమినిముని వేయిశాఖలుగా విభజించి ప్రచారమునకు దెచ్చాడు.

ఆ కాలంలో సత్యవ్రతుడనే రాజున్నాడు. ఆయన చాల ధర్మాత్ముడు. ప్రాల్మావిక లేని పరోపకారి. వేదాంతము నందిచ్చ గలవాడగుట కృతమా వికానదీ తీరాన నొక పర్ణశాల నిర్మించుకొని తపమాచరించు చున్నాడు. ఒకనాడా మహారాజు నదీతీరంలో తర్పణ లిచ్చుట కని జలము చేతపట్టగ వానిలో చేపపిల్ల కనపడింది. రాజుగారా నీటిని వెంటనే ప్రవాహంలో వొది లేశాడు. అంతనా చేప మనుష్య కంఠంతో "రాజా! పల్లెవాండ్రు వలలు పన్ని మమ్ము పట్టుక పోవుటకై వచ్చుచున్నారు. నేను వారికి చిక్కరాదని నిన్నా శ్రయించి వచ్చాను. ధర్మప్రభువు లైన మీరు శరణార్థికి ప్రాణదానము చేయక నిట్లు పరిత్యజించుట న్యాయమా!" అన్నది.

ఆ మాటల కచ్చరవు నొందిన సత్యవ్రతుండు "మీనమా! నాకు నీ విషయము తెలియక నీట విడచాను. ఐనను భయము లేదు. రమ్ము. నిన్ను నేను నిర్విచారంబుగ కాపాడెద" నంటూ చేతపుచ్చుకొని కమండలంలోనికి చేర్చి తనాశ్రమానికి తీసుకొని పోయాడు. అంతలో నాచేప పెరిగి పెద్దదై "రాజా! నాకీ కమండలం చాలలేదు. పెద్ద జలాశయము చూపింపు" మన్నది. సత్యవ్రతుం డంతట దాని నొక పెద్ద బానలో విడిచాడు. మీన మింకను పెద్దదై "రాజా! నాకీ భాండము చాలలేదు పెద్దజలాశయము చూపింపుమన్నది.

మహారాజంతట దానిని సమీపమునందున్న యొక కొలను నందుంచాడు. మత్స్య మింకను పెద్దదై "రాజా! నాకీ సరోవరం చాలలేదు పెద్దజలాశయము జూపింపు" మన్నది. ద్రవిడదేశాధిపతి దానిని సముద్రమునందు చేర్చాడు. చేప యింకను పెద్దదై "రాజా! నాకీ సముద్రము చాలలేదు. పెద్దజలాశయము చూపింపు" మన్నది.

సత్యవ్రతుం డంతట చేతులు ముకుళించి "మహాత్మా! నీవు సాక్షాద్భగవత్స్వరూపు లైన శ్రీమన్నారాయణుండవు కాని మామూలు చేపవు కావని నేనిపుడు తెలిసికొంటిని. నన్ను కరుణింప వచ్చి లీలలు చూపిన మీకివే నావందనములు. నాకు మీ నిజరూపం చూపి నన్ను ధన్యుని జేయుడని ప్రార్థించాడు.

శ్రీహరి అంతట నల్లని మేనితో, నాలుగు బుజాలతో, మణి హారాలతో, పట్టు బట్టలతో, శంఖచక్ర గదా యుధాలతో సాక్షాత్కరించి "నరనాయకా! నీకొక విషయం చెప్పాలని వచ్చాను. నేటి కేడవ దినమున బ్రహ్మప్రళయం రాబోతూంది. ప్రపంచమంతా మహాజలంలో మునిగి పోతుంది. ఆ సమయంబున సప్తఋషులొక నావనెక్కి నీ చెంతకు వస్తారు. నీవు వెంటనే దాని నెక్కి కూర్చుండుము. ఆనావ కెరటాల తాకిడికి అటు యిటు చెదిరి పోకుండ నేనొక పెద్ద పాముతో చెట్టుకొమ్మకు గట్టి కాపాడుతాను. మరి కొంత కాలాని కది మారిపోతుంది. తరువాత మళ్ళీ జగన్నాటకం ప్రారంభ మవుతుంది. నీకపుడు వైవస్వత మనువులై భూవలయ మంతా పాలించి కీర్తి నొందెద" వనిచెప్పి యదృశ్య మయ్యాడు.

నారాయణుండు చెప్పిన ప్రకారంగా సత్యవ్రత మహారాజు వైవస్వత మనువయ్యాడు. వైవస్వత మన్వంతరం జరుగుతూంది. బ్రహ్మదేవుడు వేదాల నన్నింటిని తలక్రింద బెట్టుకొని నిద్రించుచుండగ కామరూపు లైన హయగ్రీవ సోమకాసురు లనే దుర్మార్గులు మాయోపాయంతో వేదాల నెత్తు కొని పోయి సముద్రం అడుగున దాగారు. అంతట నిద్రలేచి చూచిన బ్రహ్మదేవుడు పోయి చెప్పుకొనినంతనే శ్రీహరి చేపరూపం దాల్చి సముద్రంలోనికి పోయి హయగ్రీవసోమకులను చంపివేసి ఆ వేదాలను తెచ్చి భద్రంగా బ్రహ్మకిచ్చాడు. చతుర్ముఖుడా నారాయణుని కొనియాడాడు. అంతటితో శ్రీ మహావిష్ణువు దాల్చిన మత్స్యావతారం కథ ముగిసింది.

## కూర్మావతార మహిమ

జయవిజయులు వైకుంఠపురంలో హరిద్వారం కాచే సేవకులు, విష్ణు భక్తులు ఏనాడూ యజమాని యాజ్ఞమీరి యెరుగరు. ఒకనాడు సనక సనందన మునులు శ్రీ మహావిష్ణువును దర్శింప వచ్చారు. సనక సనందులు యెప్పుడు చూచినా ఐదేండ్ల వారుగనే కనపడతారు. వారు దిగంబరులు. గొప్ప తపస్యం పన్నులు. జయవిజయములు వారికి నమస్కారం చేసి "అయ్యలారా! మేము సేవకులము కద! స్వతంత్రులము కానందున లోపలకు పోయి స్వామివారి

యనుమతి పొంది వచ్చేదము. తమరించుక నిదానించు" డన్నారు. సనకసనం దుల కెక్కడలేని తామసం వచ్చింది. కనులెఱ్ఱచేసి "ఏమిరా! బ్రహ్మమానస పుత్రులమైన మమ్ము పంపుటకు గూడ మీకింకొకరి యనుమతి కావలయునురా! మమ్మవమానించిన మీరు భూలోకంలో దానవులై పుట్టెదురు గాక" అని శపించారు.

జయవిజయములు గడగడ లాడుతున్నారు.

సింహద్వారం దగ్గర జరిగినదంతా శ్రీ హరికి తెలిసింది.

నారాయణమూర్తి లేచి చకచకా వెలుపలకు వచ్చి సనక సనందనుల కభివందనం చేసి "బ్రహ్మదేవుని ముద్దుకుమారులారా! దయచేయండి. మాకానందం. మీ పాదములు సోకినంతనే మావైకుంఠపురం పవిత్రమయింది. మా యదృష్టవశంబున మీకై మీరు వచ్చితిరే కాని మేం రమ్మంటే వచ్చేవారు కారన్న విషయం మా జయవిజయములకు తెలియకనే మీ కాటంకం చెప్పియుంటారు. పాపం వాళ్ళు చేసిం దపరాధ మైనా నిజంగా అమాయకులు. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రంలాగా మీరు శపించితే వారెంత వారు! జరిగిందేదో జరిగిపోయింది. వారి కింతటనైన శాపవిముక్తికి మార్గం చెప్పండి" అంటూ సమర్థించాడు.

పురుషోత్తముని మాటలకు పొంగి పోయిన మునులు సంతోషించి "జయ విజయులారా! మా శాప మింక మీరనుభవింపక తప్పదు కనుక మూడు జన్మలు శ్రీహరికి బద్ధవైరులై పుట్టి లోకకంటకులై చరించిన తరువాత తిరిగి మీ పదవికి మీరు వచ్చెదరా! లేక ఏడు జన్మలు వైకుంఠునికి

మహాభక్తులై జనించి దివ్యజ్ఞానులై సంచరించిన తరువాత హరి సన్నిధిని చేరుదురా! అని అడిగారు. జయవిజయు లంతట "మహానుభావులారా! మేము మాదేవదేవుని సన్నిధి నుండక యేడు జన్మల వరకు నింకొక చోటు నం దుండ జాలము. హరికి ప్రబల విరోధులమై పాపకర్ములమైన కానింపు– మూడు జన్మలతోనే శాపవిముక్తిని పొందెదము. మమ్మాశీర్వదించండి" అన్నారు.

సనకసనందన మును లట్లేనని దీవించారు.

నారాయణుం డంతట "వత్సలారా! మీరు భూలోకమున దుష్టదాన వులై పుట్టి నన్ను ద్వేషించుచున్న మూడు జన్మలలోను నేనా సమయంబు లకుం దగిన యవతారములను దాల్చి మిమ్ములను సంహరించి తొందరలోనే నాదగ్గరకు చేర్చుకొందును. లేనియెడల మీరు నాకు శత్రువులై దుర్మార్గములు సేయుదురు గదా! అపుడు మీకు మహాపాపము సంభవింపగలదు. పాపపుణ్య ఫలములను విచారించెడి యమధర్మరాజు మీకితర జన్మల నెత్త శాసింపక తప్పదు. మీరాయాకారణంబులచే తిరిగి నన్ను తొందరలో కలిసికొను నవ కాశ ముండదు. నా చేతులతోనే మీరు మరణించిన యెడల విముక్తి లభింప గల" దని వారిని తృప్తి పరచాడు.

అప్పటి కది గడచి పోయింది.

దేవతలు దానవులు కలసి పాలసముద్రం తరచ ప్రారంభించారు. ఆ సమయంలో మందరాద్రికవ్వంగాను, ఆదిశేషుడు త్రాడుగాను యుపయోగ పడ్డారు. సముద్రంలో ముందు గోష పుట్టింది. పొగ లేచింది. మంటలు మం

డినై. ప్రళయకాలాగ్ని విషజ్వాలలు నలుమూలల ప్రాకి ప్రపంచాన్నంతా మాడ్చి మసీ చేసే సమయ మాసన్న మయింది. వారి మొరాలకించిన శంకరుడు కైలాసం నుండి దిగివచ్చి భయంకరమైన దావాగ్ని నంతా చేతపట్టి నోటబెట్టి మింగాడు. ఆవిషం శివుని కంఠంలోనే నిలిచింది కనుక శివుని గొంతులో మచ్చ కనబడుతూంది. అప్పుడందరూ "అమ్మయ్య బ్రతికి పోయాం" అంటూ గుండెల మీద చేతులు వేసుకున్నారు.

సముద్ర మథనం మళ్ళీ మొదలుపెట్టారు. ఈసారి మందరగిరి బలువైనందున నీటిలో మునిగి పోతూంది. దాని నెవరూ నిలుపలేక శ్రీహరిని ప్రార్థించారు. నారాయణుడు వెంటనే పరుగు పరుగున వచ్చి తాబేలురూపం దాల్చి సముద్రంలోనికి పోయి మందరాద్రిని తన వీపుమీద మోసి మునుగకుండ కాపాడాడు. దేవతల కంతట అమృతం లభించింది. శ్రీమహావిష్ణువు దాల్చిన కూర్మావతారం కథ ముగిసింది.

## వరాహావతార మహిమ

ఆనాడు వైకుంఠంలో సనకసనందుల శాప ఫలితంగా జయవిజయయులు కశ్యప ప్రజాపతికి హిరణ్యకశపుడు, హిరణ్యాక్షులనే పేరులతో పుట్టారు. వారిద్దరూ బలవంతులు. పొగరుబోతువారు. ఇంకొకరు చెప్పినమాట నెంతమాత్రమూ వినని మూర్ఖులు. మంచిగాని—చెడుగాని తలపెట్టిన పని చేసే

వరకూ నిద్రపోరు. వారికి దేవతలంటే బద్ధవైరం—మునులమీద తీరని కోపం. మానవు లంతా దేవతల నారాధించు చున్నందున ప్రజలమీదను వారికి పగ లేక పోలేదు.

అన్నదమ్ము లిద్దరిలో అన్న కొంచెం వెనుకముందు లాలోచించినా తమ్ముడు దుందుడుకు వాడయ్యాడు. భూమినంతా చాపచుట్టి యెత్తుక పోయి సముద్రంలో దాచి వేశాడు. ప్రపంచ మంతా ప్రమాదంలో చిక్కుకుంది. మునులంతా పోయి బ్రహ్మదేవునితో మొరపెట్టుకున్నారు. బ్రహ్మకు దరీపరీ తోచక దేవతలను మునులను వెంటబెట్టుకొని పోయి శంఖరునితో చెప్పు కున్నాడు. శంకరునకు గూడ కాలుసేతు లాడక వారందరినీ తీసుకొని వైకుంఠానికి పోయి శ్రీమన్నారాయణ మూర్తిని "యిపుడేమిటి చేయడం?" అని కర్తవ్య మడిగాడు.

మహావిష్ణువు "నేనా హిరణ్యాక్షుని యెలాగు నైన చంపి మీబాధలు తప్పిస్తా" నని మాటయిచ్చి యెటువారి నటు పంపించాడు. దానవ సంహారానికి యుపాయ మాలోచించిన నారాయణుండు శ్వేతవరాహావతారమెత్తి భూలోకానికి వచ్చి భయంకర ధ్వని చేస్తున్నాడు. ఆగోష కందరూ కంపించి పోయారు. వరాహరూపంలో నున్న శ్రీహరికి యూరి వెలుపల హిరణ్యాక్షుడు దొరికాడు. వెంటనే వారిద్దరికీ యుద్ధం జరిగింది. చివరకు హిరణ్యాక్షుడు చని పోయాడు. అది చూచి దేవమునీంద్రులు కరతాళాలు మ్రోగించారు. హరి నెంతగానో కొనియాడారు. భూదేవికి రక్షణ కలిగింది. శ్రీమహావిష్ణువు దాల్చిన వరహావతారం కథ ముగిసింది.

# బ్రహ్మదేవుడిచ్చిన వరము

తమ్ముడు మరణించిన వార్త తెలియగానే హిరణ్యకశిపుడు విష్ణువు మీద యుద్ధం చేయడానికి వచ్చాడు. ఎక్కడ చూచినా నారాయణుడు కనపడనే లేదు. ఎలాగునైన వైకుంఠుని పట్టుకొని ముక్కలు ముక్కలుగ నరికి వేసి తనకక్ష తీర్చుకోవాలనే పట్టుదలతో దేశదేశాలు గాలించాడు. మాధవుడున్న చోటు చెప్పకపోతే మీప్రాణాలు తీస్తానని మునులను నిర్బంధించి నానా యాతనలు పెట్టాడు. స్వర్గలోకం మీద దండెత్తాడు. దేవేంద్రుడాతని నెదిరించడానికి ధైర్యం చాలక భార్యా బిడ్డలతో యిల్లు విడిచి యెక్కడికో పారిపోయాడు. చింతామణీ సింహాసనం హిరణ్యకశపునికి దక్కింది. రంభాది వేశ్యలు లొంగి పోయారు. స్వర్గం పాలించుతూ కూడా తమ్ముడు చనిపోయి నందుకు చింతపడుతునే యున్నాడు.

హరి యెక్కడనో దాగియున్నాడు. ఆతడున్న చోటు తెలియడం లేదు. వానిని పట్టుకొనడానికి హిరణ్యకశపుడు తపసు చేసి యింకా బలవంతుడు కావాలనుకున్నాడు. స్వర్గలోకంలో తనకు ప్రతినిధిగా యింకొకనికా రాజ్యభార మొప్పగించాడు. చెప్పవలసిన వారందరితోను చెప్పాడు. చేయవలసిన కట్టుదిట్టము లన్నీ చేశాడు. నమ్మదగిన యిద్దరు సేవకులను మాత్రం వెంటబెట్టుకొని పోయి కొండమీద తపశ్చర్యకు పూనుకున్నాడు. తనకాత్మీయులైన వారందరు గుమిగూడి వచ్చి "హిరణ్యకశిపా! విరోధులంతా పారి

పోయారు. స్వర్గలోకానికి ప్రభువు వయ్యావు. నీకన్ని సందలున్నవి. ఇంకా నీకీ తపమెందుకు! ఇంటికి పోదాం ర"మ్మని పిలిచినా ఆయన వినిపించుకొన లేదు. వాని వెంటనున్న సేవకులిద్దరూ యజమానికి తపోభంగ కాకుండా వేచియుండాలి కనుక రెండు పిచ్చికలుగా మారి చెట్టుకొమ్మమీద కూర్చొని శత్రువు రాకుండా చూస్తున్నారు.

హిరణ్యకశిపుడు చేయుచున్న తపోవేడిమికి ముల్లోకాలూ తల్లడిల్లినై. దానవుని తపోభంగం చేయాలని దేవేంద్రుడు పన్నిన పన్నుగడలన్నీ విఫలము లయ్యాయి. రాక్షసుడు తపసు మానితేనే గాని ప్రపంచానికి శాంతి కలుగదు. అంతలో నారదముని వచ్చి "నాన్నగారూ! హిరణ్యకశిపుని తపసు భంగం చేసే ఉపాయం నాకు తెలియును. మీరు విచారపడకండి. ఈపని నేను నెరవేరుస్తా"నని సరాసరి దైత్యుడు తపోదీక్ష వహించియున్న చోటుకుపోయి ఒకచోటున నెవరికి కనపడకుండ పొంచియుండి బిగ్గరగ "ఓం నమోనారాయణాయ"అని ముమ్మారు లన్నాడు.

ఆ మాటలు హిరణ్యకశిపుని చెవులలో బడినై. ఎవరైన నారాయణ నామస్మరణం చేస్తేవారి ప్రాణాలు తీసిందాకా హిరణ్యకశిపుడు వూరుకొనడు తపసు చాలించి లేచి బాణం వెక్కుపెట్టి నారాయణుని పేరెత్తిన వారెవరా? యని దిక్కులుచూచాడు. పిచ్చికలు భయపడి చెట్టుమీద నుండి పారిపోయినై. హిరణ్యకశిపునకు మళ్ళీ తపసు మీద మనసు లగ్నం కాలేదు. వెంటనే యింటికి తిరిగిపోయాడు. ఆయన భార్య లీయవతి—ఆమెకు "కయాధూ" అనే యింకొక పేరుంది. హిరణ్యకశిపుడు తనకక్కడ కలిగిన యాటంకం

చెప్పి. ఆమెతో శయనించిన తరువాత "యీపర్యాయము నేను బ్రహ్మదేవుని వరములు పొందినగాని యింటికి రా"నని శపథంచేసి మళ్ళీవెళ్ళాడు.

హిరణ్యకశిపుని తపస్సు మరలా ప్రారంభమయింది.

మరలా లోకాలన్నీ కంపింపసాగినై. దానవుని తపోవేడిమి యీసారి యింకను ప్రళయరూపం దాల్చింది. మాధవుడాలోచించి బ్రహ్మతో "చతురాననా! నీవుపోయి వానికి కావలసిన వరముల నిచ్చిరమ్ము. రేపాతడు లోకకంటకుడైనప్పుడు వాని నంతమొందించే ఉపాయం చూడొచ్చు"నన్నాడు. కమలాసనుండంత హిరణ్యకశిపునకు ప్రత్యక్షమై "కశ్యపబ్రహ్మకుమారా! నీభక్తి కానందించాను. నీకు కావలసిన వరమిస్తాను కోరుకో" అన్నాడు. హిరణ్యకశిపుడింత కష్టపడి తపసు చేసింది దానికే కనుక పితామహుని కొనియాడి" దేవా! నేను సురాసుర గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ద సాధ్యాదుల చేతను, జంతువుల చేతను, మృగముల చేతను, క్రిమికీటకముల చేతను, ఏయాయుధము చేతను, ఇంటను—బయటను, భూమియందు, గగనములందును, పగలు రాత్రులందును మరణింపని వరము దయచేయు"మని ప్రార్థించాడు. పితామహుండంతట "వత్సా! నీవడిగిన యీవరము నీకిచ్చుచున్నాను. నీవునేనిచ్చిన యీ వరమును దుర్వినియోగము చేసికొనక సుఖింపు"మని చెప్పి యదృశ్యమయ్యాడు.

# ప్రహ్లాదుని జననము

హిరణ్యకశిపుడు విజయగర్వంతో తిరిగివచ్చి రాజ్యం పాలించుచున్నాడు. ఇప్పుడాయన పేరుచెబితే పసిపిల్లలు పాలుద్రావడంలేదు. దిక్పాలకు లంతవారు దిష్టిబొమ్మలై కూర్చున్నారు. మునీంద్రులకు జపతపయోగసాధనలు జరుగుట లేదు. పాపకర్మలు చేసిన రాక్షసులను విచారించడానికి యమధర్మరాజుగూడ భయపడు తున్నాడు. దేవతలంతా బ్రహ్మదేవుని చెంతకుపోయి "బ్రహ్మదేవా! హిరణ్యకశిపుడసలే దుర్మార్గుడు. వానికి మీరిచ్చిన వరాలతో యింకా గర్వించి కన్నూమిన్నూలు కానకున్నాడు. ఆ రాక్షసుడు చచ్చేదెపుడు?—మా కష్టాలు గట్టెక్కె దెపు"డని మొరబెట్టుకున్నారు.

ఆ సురమునీంద్రుల నూరడించిన కమలాసనుండు వారితో "అయ్యలారా! వాడు చేయుచున్న తపోవేడిమికి ప్రపంచమంతా మాడిపోయే పరిస్థితి సంభవించింది. కాదని మనం చేయగలది లేదు. నేనాతనికావరముల నీయ కుండెనేని యీపాటికే ప్రమాదము కలిగియుండేడిదో చెప్పాజాలము. ఏది యెటులైనగానిమ్ము. ముందు వానికా వరమునిచ్చి యీ యుపద్రవమును తప్పింపు"మని నాకు దామోదరుండు చెప్పినందుననే నేను దానవుండడిగిన దానికెల్లయు నంగీకరించా"నని సమాధానమిచ్చాడు.

ఇంతలో నచట కేతెంచిన నారదముని వారలచూచి "మునిబృందారకులారా! హిరణ్యకశిపుని మనమిపుడేమియు చేయజాలము, కాని మరికొంత

కాలము గడచినచో నాత డంతరించుసమయము వచ్చుచున్నది. ఆతన భార్య లీలావతి యిపుడు నిండు గర్భవతియై యున్నది. ఆమె యందుదయింప నున్నవాడు గొప్ప హరిభక్తుడు కాగలడు. ఆకుమారుని వలన తండ్రికి మరణము తప్పదు. హిరణ్యకశిపుడు తపసునందుండగ నేను రహస్యముగ దాగి యుండి "ఓం నమోనారాయణాయ" యని ముమ్మారు లరచితిని. నారాయణ నామమాలకించిన రాక్షసేశ్వరు డింకచిత్తశుద్ధికుదరక యింటికిపోయి భార్య చెంత మూడుదినంబులున్న తరువాత మరలవచ్చి తపోదీక్షవహించాడు. నారాయణనామంబునాలకించిన కోపంతో మనంబున దానినే తలచుచు సతీసంగమము చేసి నందున వానికి చలనము లేని హరిభక్తుడు పుట్టబోవుచున్నాడు. నేనీ విషయంబు దేవేంద్రునకు గూడ చెప్పియున్నాను.

హిరణ్యకశిపుడే యింత దుర్మార్గుడు వీనికి పుట్టబోవు కొడుకెంత పరమ దుర్మార్గుడగునో—అంతవరకు నుపేక్షింపక యిప్పుడే తల్లిని చంపివేయుట మంచిదని భావించి లీలావతిని చంపుటకై జుట్టుపట్టి యీడ్చికొని పోవుచున్న దేవేంద్రునితో నేనీ యుదంత మంతయు వివరించాను. నిజంగా యీమె కడుపున నున్నబిడ్డ హరిభక్తుడైనయెడల నేనిపుడీమె కెటువంటి యపకారము కలిగింపరా"దని తలంచినందున యింద్రుడామెను విడిచిపోయాడు. కనుక మీరును కొంతకాలమోపికపట్టండి. తరువాత పరిస్థితులన్నియు బాగుపడనున్న" వన్నాడు.

విన్నవారంతా సరేనని తిరిగి పోయారు.

తరువాత కొద్దిరోజులలోనే లీలావతి ప్రసవించింది. పుట్టిన కుమారుని చూచుకొని హిరణ్యకశిపుడు పొంగి పోయాడు. మహావైభవముగా బారసాల చేసిన దానవరాజు కుమారునికి ప్రహ్లాదుడని నామకరణం చేశాడు. ఎత్తిన చేయి దించకుండా యెందరికో దానధర్మాలు చేశాడు. కొడుకు పెరిగి పెద్ద వాడయ్యాక తన కన్నివిధాలా తోడ్పడుతాడని కలలు గంటున్నాడు. ప్రహ్లాదునికి ఐదేండ్లప్రాయం వచ్చింది. రాజగురువులైన చండామార్కుల వారిని పిలిపించి "నాకుమారునకు విద్యలునేర్పి గొప్పవానిని చేయు"డంటూ ప్రహ్లాదుని గురుకులానికి పంపించాడు.

# ప్రహ్లాదుని విద్యాభ్యాసం

గురుకులవాసంలో ప్రవేశించిన ప్రహ్లాదుడు ఉపాధ్యాయులు చెప్పి గొప్పక ముందే పాతాలనన్నింటినీ చదివి మరచిన వానిలాగా చదువుతూ కొద్దిరోజులలోనె గొప్ప వేదాంతి అయ్యాడు. కొన్ని విషయాలలో గురువు గారు కూడ రాజకుమారునికి సమాధానం చేప్పలేక మీనమేషాల లెక్కించే పరిస్థితికి వచ్చాడు. బడిపిల్లలంతా ప్రహ్లాదుని వారికి నీతిప్రబోధలు చేస్తు న్నాడు. రాజకుమారుని తెలివితేటల కా చండామార్కులు సంతోషించుచు న్నాడు కాని వాని ప్రవర్తన చూచి భయపడి పోతున్నాడు.

ప్రహ్లాదుడెపుడు చూచిన "హరీ! మాధవా! కేశవా! ముకుందా! నారాయణా! ఇందిరారమణా!" అంటున్నాడేకాని "శివా! శంకరా! మహేశ్వరా! గౌరీరమణా! నాగాభరణా!" అనడంలేదు. హరినామస్మరణమంటె హిరణ్యకశిపుడు మండిపడతాడు. ప్రాణాలు దీయించిగాని పగదీర్చుకొనని పంతగాడు. అంతదాకాయెందుకు? నామాటవిని నారాయణుని పేరెత్తకు"మని నయానా భయానా చెప్పిచూచినా ప్రహ్లాదునిలో మార్పు రావడంలేదు. రాజకుమారుడైనందున గట్టిగా దండించడానికిగూడ వెనుకాడుతున్నాడు.

ఉపాధ్యాయులవారు పాఠశాలలో లేని సమయాన ప్రహ్లాదుకు తోడిబాలురను చేరబిలిచి "సోదరులారా! ప్రపంచమొక మాయావలయం. తల్లి మాయ—తండ్రి మాయ—భార్యమాయ—బిడ్డలుమాయ—బంధు మిత్రులు మాయ—భాగ్యభోగ్యములుమాయ. మాయకాని దేదియునులేదు. ఇండ్లు వాకిళ్ళునావని యిల్లాలునాదని మానవుడు భ్రమలోపడి బాధల పాలవుతున్నాడు మాయాంధకారంలో మార్గంతోవల బట్టక మోక్షపదవి పొందడానికి మాధవ నామస్మరణ యొక్కటియే శరణ్యం. మీరందరు నారాయణ నామమంత్రం జపించండి. నారాయణమూర్తిని నమ్మిన వారికి నాశనముండదు.

మన మింతకుముందు కూడ యెన్నిమారులో పుట్టాం. ఎక్కడెక్కడనో పుట్టాం. ఎవరేవరికోపుట్టాం. ఏమేమోచేశాం. అలాగే యిపుడూపుట్టాం ఇంకాపుడతాం. ఐతేయీసారి యీలాగ మానవులమై పుడతామనే నమ్మకం లేదు. కుక్క, కోతి, యీగ, దోమ, కోడి, చెట్టు యింకా యేరూపాలలోనైన పుట్టొచ్చు. మనం చేసేమంచిపని, చెడుపనుల ననుసరించి అనగ మన

పాపపుణ్యములను బట్టి మనం మళ్ళీ మళ్ళీ జన్మలనెత్తి సంచిత కర్మలనను భవించితీరాలి. అలాగా బాధలు పడకుండా— మళ్ళీ జన్మించకుండా మోక్షం పొందడమే మనకు కావాలి. ఆముక్తినిచ్చే నారాయణుని నామం జపించుదాం రండి" అని భక్తిప్రబోధలు చేస్తుంటాడు. వారందరనూ కూడగట్టుకొని "ఓం నమోనారాయణాయ" అనే మంత్రాన్నే పలుకుమన్నారు.

రాక్షస బాలురంతా శ్రీహరి నామం చెబుతున్నారు.

చండామార్కులవారి నోటి మాట రావడం లేదు.

"నాయనా! ప్రహ్లాదా! నీవా హరిని తలంచుట మంచిది కాదయ్యా! నా మాట విను. సాంబశివుని నామమంత్రం పఠింపవచ్చును కాని నారాయణుని పేరైనను చెప్పరా" దనగ ప్రహ్లాదుడు చిరునవ్వులు నవ్వుతూ "గురుదేవా! మోక్షసాధనంబైన ముకుంద మంత్రము నుపదేశింప దగిన మీరే యిటు లను చున్నారా! మీరీ నాడొక రాక్షసరాజు పాలనమున భయపడి శ్రీహరి నామ స్మరణము సేయని పాపమున రేపా సమవర్తి దండకమునకు గిరిగా బోవు చున్నారు. సకల వేదములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు చదివిన పండితోత్తములకు నేనింతగా చెప్పవలయునా!" అనినంత నుపధ్యాయు లేమియును మాటలాడలేక పోయారు.

రాజకుమారుడు ఆటలాడేటప్పుడు—పాటలు పాడేటప్పుడు—అన్నం తినేటప్పుడు—నీరు త్రాగేటప్పుడు—నిద్రపోయేటప్పుడు గూడ హరినామ స్మరణ మానడం లేదు. అదృశ్యరూపంలో వచ్చి ప్రహ్లాదుని ప్రవర్తన మంతా చూచి పోతూన్న నారదమహాముని ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ

మనసులో మాత్రం "హిరణ్యకశిపా!" నీకు మంచి ప్రాయశ్చిత్తం కానున్నదిలే" అనుకుంటున్నాడు.

కొద్దిరోజులు జరిగినై.

# చదవుకొనిన కుమారుడు

హిరణ్యకశిపు డొకనాడు సభదీరి కూర్చున్నాడు కుమారు డెంత వరకు చదివి ప్రయోజకు డయ్యాడో చూడాలనే కోరిక కలిగింది. వెంటనే సేవకుని పిలిపించి "ఓయీ! నీవిదే గురుకులానికి పోయి మన చండమార్కుల వారిని, కుమారరాజా ప్రహ్లాదుని వెంటబెట్టుకొని ర"మ్మని యాజ్ఞాపించాడు. రాజ పిలుపు వినినంతనే గురువుల వారి ప్రాణా లెగిరిపోయినై. ఐనా తప్పని లేమ కనుక ప్రహ్లాదుని వెంటబెట్టుకొని రాజసన్నిధానికి వచ్చి నిలుచున్నాడు.

కుమారుని చూచినంతనే దానవేశ్వరుడు రెండు చేతులూ చాచి యెత్తి తొడమీద కూర్చుండబెట్టుకున్నాడు. బాబుని తలవెంట్రుకలు చేతితో సవరించాడు. గడ్డం ముద్దాడాడు. ఉపాధ్యాయుల వారికి తగిన మర్యాదలు చేయించిన

తరువాత నిండు ప్రేమతో ప్రహ్లాదుని చూచి "నాయనా! చిరంజీవీ! అయ్య వారు చెప్పినట్లు చదువుతున్నావా!" అని అడిగాడు.

చదివాను నాన్నగారూ!

ఏం చదివినావయ్యా!

చదవ దగిన చదువంతా చదివానండి నాన్నగారూ!

ఏదీ! నీవు చదివినది నాకు వినిపించు తండ్రీ!

ఓం నమో నారాయణాయ.

ఉలిక్కిపడ్డాడు హిరణ్యకశిపుడు. చండామార్కుల వారి వంక చూచి నంతనే ఆయనగారు గడగడ లాడుతు లేచి "ప్రభూ! కుమారారాజా వారికి యీ పదమెట్లు పట్టుబడినదో తెలియదు కాని మేమెన్ని విధముల చెప్పినను మామాట చెవిబెట్టుట లేదు. ప్రభూ! మావిన్నపం మన్నించండి" అన్నారు.

రాక్షసరాజు కొంతవరకు సౌమ్యంగానే "ఆచార్యులు గారూ! మీరు నిజమే చెప్పుచున్నారా! మీరొకటి చెప్పిన యీబాలు డింకొకటి యనునా! నేను నమ్మలేకున్నాను. మిమ్ము నేనెంతయో గౌరవించుచున్నాను. మీకేలోప మును రానీయకుండ చూచుచున్నాను. గురు వంశము వారైనందున దైవముగ పూజించుచున్నాను. మీరే నాకింతటి యన్యాయం చేయుదురని నేననుకొనుట లేదు. నాసొమ్ము తినుచునే నాబిడ్డనిట్లు పాడుచేయుట మిముబోంట్లకు న్యాయముగాదు. నేను తలచుకుంటె మిమ్ము మీ కుటుంబంలోని వారందరను వురదీయించుటొక కష్టమైన పనికాదు. కాని యిప్పటి కేమియు నన ఒలంచు కొనలేదు. నాకుమారుని మరల మీవెంట గొనిపోయి కఠినముగ దండించి

యైనను యీమార్గము నుండి మరలింపజేసి నాయొద్దకు తీసికొని రం"డని ప్రహ్లాదుని వారికే యొప్పగించాడు.

చండమార్కు లంతట ప్రాణగండము తప్పినందులకు సంతోషించుచు "మహారాజా! మీరు మామాట లాలకింప వలయును. మేము రాజద్రోహులము గాని—నమ్మిన ద్రోహులముగాని—కానేరము. ఇంతకాలము ప్రభువుల వారి కెటువంటి యపకారము చేసి యెరుంగము. ఇక చేయబోము. మా శక్తివంచన లేక మేము ప్రయత్నించుట యందెట్టి పొరపాటు లుండవు. ఐనను కుమారా రాజావారి నీమార్గం నుండి నేను కాదుగద—నన్ను పుట్టించిన బ్రహ్మ దేవుడైనను మరలింప జాలడని తోచుచున్నది.కావలయు నేని మీరు నన్ను పరీక్షింప వచ్చు"ను తెలిపి ప్రహ్లాదుని వెంటబెట్టుకొని పోయాడు.

కుమారుని గురించిన యాందోళన తండ్రి కేర్పడింది.

రాక్షసు లంతా శివారాధనలు సేయువారు. వారి సాంప్రదాయము రాక్షస రాజ్యానికి వైష్ణవమతాభిమానిని ప్రభువును సేయుట కంగీకరింపదు. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు పెద్దకొడుకు. అదియును గాక తాను తపసు సేయుచున్న సమయంబున బుట్టిన పుత్రుడనే ప్రత్యేకభిమానమును కలదు. అందులకుం దగినట్లుగా వానిలో జనాకర్షణయున్నది. ఇట్టి వానిని తన తరువాత తన సింహాసన మెక్కించి తానింకా కొన్ని ఘనకార్యాల సాధించాలని వాని ముందాలోచన. తన కుమారుడలాగా కేశవ, మాధవ, నారాయణ అనడం తనకు గిట్టకపోవడమేగాక తనరాజ్యాని కధికారిని కాకుండ రాక్షస

నిబంధన అడ్డుకుంటుంది కనుక యెటులైనను ప్రహ్లాదునా హరిభక్తి నుండి మాన్పించడమాయన కొక ప్రధాన కార్యమయింది.

## చదువులలోని సారము

మళ్ళీ కొద్ది రోజులు గడిచిన తరువాత హిరణ్యకశిపుడు తన కుమారుని రావించాడు. ప్రహ్లాదుడు యీసారి కూడ తండ్రిగారి దగ్గరకు సరాసరి పోబోయాడు. రాక్షసరాజు వెనుకటి మాదిరిగా దగ్గరకు తీసుకొనకుండగనే నిలువుమని "నీవాహరినామస్మరణ మానితివా, లేదా!"అన్నాడు గంభీరంగా. ప్రహ్లాదుడు ప్రశాంతముగనే "హరినామస్మరణము మానుటయా!"నాన్నగారూ నాపాలిట తల్లీ; తండ్రి; గురువు; దైవము—నాతోడు నీడలు సర్వస్వమునైన హరినామస్మరణము నేను మరచియుండగలనా? అన్నాడు.

హిరణ్యకశిపుని కోపం మరింత పెరిగింది. "వీలులేదు. నీవా హరిని స్మరింపరాదు. ఈలోకము నంతయు నేను జయించాను. నేను పాలించుచున్నాను. నాశాసనమును నిరసించి భూమి మీద బ్రతుక జాలిన వాడెవడును లేడు. జగజగాలకు నేనే ప్రభువును. దైవమును. ఇంతవాడనైన నేను నీకు తండ్రినై చెప్పుచున్నాను. నాకుమారుడవైన నీవు యింకొకనికి తలవంచి మ్రొక్కి వాని నామమును స్మరించుటయా! అవమానము—మనరాక్షస వంశమునకే అవమానము"అన్నాడు.

అందులకా ప్రహ్లాదుడు తిరిగి "నాన్న మీరు గొప్పవారు. కాని భగవంతుడవు కావు. ఆయన యింకనుగొప్పవాడు. మీరొకప్పుడు బ్రహ్మదేవుని వరముల పొందారు కాని; హరిచే ప్రార్థింపబడదగిన వారింకొకరు లేరు, ఆయన సర్వశక్తిమయుడు. ఉండియులేనివాడు—లేకనుండువాడు. దేరూపము కానివాడు—అన్నిరూపములునైనవాడు. అందరియందుండువాడు-ఎవరికి నంటనివాడు. ఆయనను మించిన వారెవరును లేరు. పరమేశ్వరుడైన శ్రీహరిని ద్వేషింప మంచిదికా"దన్నాడు.

కుమారుని మాటలు ముద్దు వచ్చుచున్నవి. అంతులేని వేదాంత భావ మిమిడి యున్నవి. కాని పగవాడైన హరిని కొనియాడడ మాయనకు సహింపరాని దయింది. బాబూ! అలాకాదురా! నామాట విను. నేను నీతండ్రిని. నీ మేలుకోరి చెబుతున్నాను.

ఒకనాడు మనమా దేవతలకు దగ్గరవారము.

మన రాక్షస వర్గానికి దాయాదులైన దేవతలు మనకు చేసిన యపకారాలు లెక్క లేవు. అవి మన్నింపరాని మహాపరాధము లనకను తప్పదు.

నీవు నమ్మియున్న ఆ నారాయణుడు దేవతలలో చేరి మనమీద నిష్కారణంగా పగబూనివున్నాడు. మా మోపాయాలుచేసి మనలో పేరు చెందిన పెద్దపెద్దవారి నందరినీ చంపివేశాడు. అంతేకాదు. నాతమ్ముడు అంటె నీకు స్వయమగ చిన్నాయన గారైన హిరణ్యాక్షుని గూడ సంహరించాడు. అతను మనకు మన్నింపని మహాపకారం చేసిన ప్రబల శత్రువు. వానిని పట్టి చిత్ర హింసలు పెట్టవలయునని నేను లోకములన్నీ గాలింగాను. కాని

నాకంటికి కనపడక యెక్కడనో దాగియున్నపారిపోతు. ఈవిషయంబులు నీకు తెలియవు. నీకెవరో దుర్బోధలు చేసి నిన్నిట్టుమార్చియుంటారు. ఇప్పటికైనా నీవీ పంతంవిడిచిపెట్టు"మన్నాడు.

భక్తులకు భగవన్నామ స్మరణ మింకొకరు చెప్ప వలయునా?

నా కింకొకరు చెప్పలేరు— చెప్పుడుమాటలాలకించు వాడనుగాను.

నానమ్మకము నాది. వైకుంఠుని భక్తినేను విడనాడను.

శ్రీమహావిష్ణు పాదంబులకు మ్రొక్కని శిరము శిరమా?—ఆయనను దర్శింపని కన్నులు కన్నులా! ఆయనను కీర్తింపని నాలుకనాలుకా, ఆయన కథలాలకింపని చెవులు చెవులా! ఆయన నామస్మరణలేని మనసు మనసా? ఆయనను సేవింపని చేతులు చేతులా! ఆయన భక్తి తెలియని జన్మ జన్మయా! నాకిది దైవమిచ్చిన జన్మ—దైవారాధనకే యర్పించుచున్నాను

నీవీ హరినామస్మరణ మానవా!

హరినామ స్మరణలేక నేను బ్రతుకజాలను నాన్నగారూ!

ఐన నేను కఠినముగ దండింపక తప్పదు.

హరి సంకల్పమయిన దానిని తప్పించు వారెవరు?

అందులకును తెగించితవా! సరె అనుభవించెదవనిన హిరణ్యకశిపుడు సేవకులను రావించి ఓయీ! ఈతడు నాకుమారుడని మీరేమియు మొగమాటపడక చెట్టునకు గట్టివైచి చురుకైన బెత్తములతో కొట్టండి. ఆ కింకరులారా! ఇంకొకమాట—ఎప్పుడీ బాలుడు "నేనింక హరినామ సంకీర్తనము సేయ"

నని యనునో, ఆ తరువాత నొక్క దెబ్బనైనను గొట్టక వెనువెంటనే కట్లు విప్పకొని జాగ్రతగా నాకడకు తీసికొనిరండి" అని యాజ్ఞాపించాడు.

## విషము ద్రావిన విరూపాక్షుడు

రాజానతి మీరరానిది. సేవకులు నేరస్తులు కాజాలరు. ఏలినవారి మాట ప్రకారముగ ప్రహ్లాదుని చెట్టుమానుకు గట్టి బెత్తములతో కొట్టారు. కఱ్ఱలు ముక్కలై పడిపోయినై. దండించిన కింకరు లలసి పోయారు. చూచిన వారంతా యీచిత్రమేమిటి? వ్రేలెడులేని బాలుడు యిన్ని దెబ్బలు కొట్టినా "అమ్మా!" అనడు. కొట్టొద్దనడు. చేతు లడ్డముపెట్టడు. పారిపోవ ప్రయత్నింపడు. సరికదా, వీని శరీర మలుసంతయైనను కందలేదు. ఇతడు సామాన్యుని వలె లే"డను కొనుచున్నారు.

ఈ సంఘటన హిరణ్యకశిపుని గూడ ఆశ్చర్య చకితుని చేసింది.

తన కుమారునిలో యేదో యొక గొప్ప శక్తి యున్నదని తండ్రి కర్థమయింది.

ఇంత ప్రజ్ఞాశాలియైన నాకుమారుడు నామాటవింటె యెంతబాగుండు ననుకున్నాడు. మరలా యోచించాడు. మహారాణి లీలావతీదేవిని అంతఃపురము నుండి పిలించి "లీలా! చదవేస్తే ఉన్న తెలివి పోయిందన్నట్లు నీకుమారు

దెంత ఘటికు డయ్యాడో చూచావా!" అతడిప్పు డొక విధంగా నాకు ప్రతి పక్షంలో చేరిన వాడయ్యాడు. మనకు, మనవంశానికి గూడ శత్రువయిన మాధవనామ స్మరణ మానకున్నాడు. తండ్రిగా నేను ప్రథమదండన చేసి చూచితిని. ఎంతకును నామాట వినడాయె. మహారాణీ! మన్మధుని మించిన రూపవంతుడైనా సరె-బ్రహ్మదేవుని మించిన విద్యావంతుడైనా సరె-కుమార స్వామిని మించిన బలవంతుడైనా సరె తలిదండ్రుల మాటవినక వంశకీర్తి ప్రతిష్ఠలకు కళంకము కలిగించు కుమారుడు మరణించి తీరవలసినదే.

ఇదుగో కాలకూట విషం. దీనిని నీవు నీచేతుల మీదుగా వానికి ద్రావింపుము. దేవి! ఈపని నీవు చేయలేనిదని నాకు తెలియును. కన్నకొడుకుకు చేతులార విషం ద్రావించు తల్లిపడే వేదన చూచియైన కొడుకు మనసు మరు తుందేమోనని "నేనీపనిని నీవేచేసి తీరవయును"నని కఠినముగ విధించు చున్నాను. బిడ్డబుద్ధిమంతుడై నీమొగము చూచియైన హరినామస్మరణమానిన పక్షమున వానిబొజ్జనిండా, పాలు పాయసము లారగింప చేసి ఆ శుభవార్త నాకు వినపింపుము. మళ్ళీమళ్ళీచెప్పే పనిలేదు. నీకిదే చెప్పెద మంటూ" అక్కడ నుండి వెళ్ళిపోయాడు-హిరణ్యకశిపుడు.

మగని మనసు నెఱింగిన మానవతి -పతిమాట జవదాటి యెరుంగని పతివ్రతా శిరోమణి లీలావతీదేవి నోటిమాటరాక నిల్చబడి పోయింది. కన్న కొడుకు నోటికి కటికి విష మందించడమా! ఏ తల్లయినా యీపని చేయ గలదా! నిజమేకాని, చేయక చేయగల దేముంది? చెప్పదగిన మాటలన్నీ భర్తే చెప్పాడు. ఈ పని తను చేయకపోయినా ప్రభువు తనకంటెదుట యిం

కొకరి చేతనైన చేయించెదరు కాని విరమించుకొాద” రని యోచించుచుండ తన యొద్దకు వచ్చిన ప్రహ్లాదుడు “తల్లీ వందనముల”ంటూ పాదములపై వ్రాలాడు.

లీలావతి చివాలున వ్రాలి కుమారుని రెండుచేతుల నెత్తి ఆలింగనం చేసుకుంది. కంటినీటిని పమిట చెంగున నద్దుకుంటూ “ఏం నాయనా! మీనాన్న గారి మాట వినరాదూ! ఆయనగారు పట్టినపట్టు విడిచి పెట్టువారు కారు. దైవ మైనను తండ్రిమాట వికరాదనునా!” అనుచుండ రాజభటులు విషంతో నిండిన పాత్రతెచ్చి ఆమె చేతికందించి “యిది మహారాజాజ్ఞమ్మా” అన్నారు. ఆ మాతృమూర్తి పొంగి వచ్చే దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ “నీవు నీయల వాటు మానకపోతే....” అని చెప్పలేక బావురుమన్నది. అందరి హృదయా లొక్కసారిగా ద్రవించి పోయినై.

ప్రహ్లాదుడు తన వ్రేలితో లీలావతి కన్నీరు తుడిచి “అమ్మా! భయ పడెదవెందుకు? మహాప్రభువుల వారు నిన్ను నాచేత విషం ద్రాగించ మన్నారు—నన్ను త్రాగమన్నారు. ఇంతేగదా! నీభర్తగారి యాజ్ఞ నీవు పాలించు—నాతండ్రిగారి యాజ్ఞ నేను పాటిస్తాను. అమ్మా! ఈవిషం నాగేం ద్రుని కోరలనుండి వచ్చింది. నాగేంద్రుని మీద శయనించే దేవదేవుడు నారా యణుడు కావున శ్రీహరిభక్తుల నీవిషం చంపగలదా!” అంటూ విషపాత్ర నెత్తి గటగట త్రాగివేశాడు. విషం త్రాగినాక గూడ ప్రహ్లాదుని చిరు నవ్వులు తరగలేదు—మొగము నల్లబడలేదు. పూర్వంకన్న తేజోవంతంగాక ళ కళ లాడుతున్న కుమారుని లీలావతి తనివిదీర నాలింగనం చేసుకొని యేమన వలయునో తోచక యుక్కిబిక్కిరవుతూంది.

చాటునుండి జరిగినదంతా కన్నులారా చూచిన హిరణ్యకశిపుడు కూడ "అమ్మయ్యా!" అని గాలి పీల్చుకొని సంతసించాడు. కాని తనలోని అహంకారం, అధికార గర్వాలు–హరిద్వేషం మొదలైనవి వానిని మరింత కఠిన హృదయునిగా రూపొందించి నందున కుమారునికి మరింతగా దూరమవుతున్నాడు. పాములవాండ్రను పిలిపించి కోడెత్రాచులచే గరపించినను ప్రహ్లాదుడు మరణింపలేదు.

## మరణములేని మహాదేవుడు

నాయంతవాడను నేను యీచిన్ని బాలుని ముందోడిపోవుటయా! ఇతని చేత నేనా హరినామ స్మరణ మాన్పింపని నా ప్రతాపమెందు కనుకొన్నాడు హిరణ్యకశిపుడు. వెంటనే రాజకింకరులను పిలిపించి "మీరీ కుమారుని మదపుటేనుగు కాళ్ళక్రింద త్రొక్కించండు" అన్నాడు. మావటీలు రాజాజ్ఞ కాదనలేక యేనుగులను దోలికొని వచ్చి ప్రహ్లాదుని మీద త్రొక్కించారు. బాలభక్తునకా యేనుగొక యీగకన్న తేలికయింది. వానిమేను కసికందలేదు రాజకుమారుడు ముసిముసి నవ్వులు నవ్వుతూ "పూర్వం గజేంద్రుడు మంచి నీరు త్రావను సరోవరంలో దిగినపు డాతనిని మొసలి పట్టి పీడించింది. ఆ సమయంలో విష్ణుమూర్తి వచ్చి మొసలిని చంపి గజేంద్రుని సంరక్షించాడు. శ్రీహరిభక్తుల నీయేనగు త్రొక్కి చంపగలదా!" అన్నాడు.

రాజకింకరులు రాజాజ్ఞచే ప్రహ్లాదుని యెత్తయిన కొండల మీదనుండి దొర్లించారు. కొండపైనుండి క్రిందిదాకా రాలలో దొరలుకొంటూ వచ్చినను ప్రహ్లాదుని మేని కలుసంత దెబ్బతగలలేదు. అదికాదని యిద్దరు మొరటు వాండ్రతనిని రెక్కలు పట్టుకొని పోయి యెత్తయిన శిఖరం నుండి క్రిందికి పడవైచారు. పురుషోత్తము డా సమయంలో అదృశ్యంగా నిలిచి ప్రహ్లాదుని తనచేతుల మీద పట్టుకొని మెల్లగదించాడు. పకపక నవ్వుచున్న రాజకుమారుడు "దేవదానవులు పాలసముద్రం తరచేటప్పుడు మందరాద్రిని కవ్వంగా నియమించుకొన్నారు. కొంతసేపటికా కొండమునిగిపోతూండగా నారాయణుండు తాబేలావతారం దాల్చి దానిని మోసి యున్నందున శ్రీహరిభక్తుల నీ కొండ చంపకలదా!" అన్నాడు.

ప్రభువు శాసించినందున భటులు మిక్కిలి పదునైన శూలాలు బల్లెలు ప్రహ్లాదుని శరీరంలో గ్రుచ్చారు. ప్రహ్లాదుని తాకినంతనే శూలాలు బల్లాలు ముక్కలై పోయాయి కాని బాలుని మేన నొక్క నెత్తురు బొట్టయినా కనపడలేదు. రాజకుమారుడు చిరునవ్వులు నవ్వుతూ "యీ శూలాలు, బల్లాల కన్న శక్తివంతమైన వేయి నాల్కలు గల సుదర్శన చక్రమే చేతనుంచుకొనిని శ్రీహరి భక్తుల నివి చంపగలవా!" అన్నాడు.

కటికి విషం ద్రావించినా చావలేదు—

త్రాచుపాముల గరపించినా చావలేదు—

ఏనుగు కాళ్ళ త్రొక్కించినా చావలేదు—

కొండమీద నుండి క్రింది వేయించినా చావలేదు—

శూలాల పొడిపించినా చావలేదు—

ఏమిటి యీచిత్రం? ఎక్కడున్నదీ మాయ? ఏరూపమున నున్నదితని చావు? నిజానికి చావ నవసరంలేదు—చావకూడదుగూడ. ఏమిచేసిన నీతండు మరణభయము చెంది హరినామస్మరణమాని యితడు నాదారికి రాగలడు? ఆ యుపాయమే తెలియుటలేదు. అని యాలోచించిన హిరణ్యకశిపుడొక పెద్ద గంగాళం నిండా నూనెపోయించి దానిక్రింద మంటలు పెట్టించాడు. నూనెసల సలక్రాగింది. సెగలు పొగలు జిమ్ముచున్న నూనెగంగాళం దగ్గరకు పోయిన వారే మాడిపోతున్నారు. రాక్షసరాజు మనసు రాటుచేసుకుని ప్రహ్లాదునెత్తి కళ పెళలాడుచున్న తైలపాత్రలో బడవేయించాడు. మరగుచున్న తైలం మంచి పాలయ్యాయి. అందులో తామరపుష్పం వికసించింది. పద్మం మధ్య పద్మాసనం చేసి కూర్చున్న ప్రహ్లాదుడు "ఓం నమోనారాయణాయ" అంటున్నాడు.

హిరణ్యకశిపుడు గర్జించుతూవచ్చి "యింకను చావలేదా!"అన్నాడు.

రాజకుమారు డానందముగ "యీ తప్తతైలము కన్న భయంకరమైనది నాడు పాలసముద్రము నందావిర్భవించిన దావానలం. మహాగ్నిజ్వాలల న్నింటిని మంచిబెల్లంలాగా నంగిట నుంచుకొన్నవాడు శంకరుడు. శంకరుడు శ్రీమన్నారాయణ మహిమంబు వర్ణించి పార్వతికి చెప్పిన భక్తుడు కావున శ్రీహరి భక్తులనీ తప్తతైలము చంపగలదా!" అన్నాడు. హిరణ్యకశిపుడు తిరిగి పోయాడు.

# రాజ్యాంగ ధర్మ విచారణ

కశ్యపబ్రహ్మకు కొడుకునై పుట్టాను—ప్రతిభాశాలినై ప్రవర్తించాను—బ్రహ్మచేత వరాలను పొందాను. లోకాలనన్నింటినీ జయించాను. అష్టదిక్పాలకుల నందరినీ యోడించాను—స్వర్గలోకాని కధికారి నయ్యాను. ప్రపంచ మంతటా యెదురులేని చండశాసనుడనయ్యాను. కాని, యీ నాటికి నేకొక్క చిన్న బాలుని విషయంలో నేను, నా ప్రతాపం, నాయధికారాలన్నీ పనికిరాకుండ పోవడమా! ఎంతవమానము? మా వంశానికే ప్రబల శత్రువైన విష్ణునామ మింతగొప్ప దగుటయా! ఇపుడేమి చేయవలయునను తపనాందోళనలదో హిరణ్యకశిపున కన్నం సహించడంలేదు—నిద్ర పట్టడంలేదు—మనసు నిలుచుట లేదు.

అంతలో రాక్షస గురువులు శుక్రాచార్యులు విచ్చేశారు.

ఆచార్యులను కూర్చుండ నియమించి మర్యాదలు చేసిన తరువాత తన కొడుకు గొడవ నంతా చెప్పుకున్నాడు. రాక్షసేశ్వరుడు ఆమాట లాలకించిన శుక్రాచార్యుడు "కశ్యపకుమారా! నేనా విషయమును గురించి మాటాడుటకే వచ్చాను. "నీతరువాత యీరాజ్యానికి కాబోయే ప్రభువులెవరన్నదే మన కిపుడు కావలయునన్నాడు సూటిగా. హిరణ్యకశిపుడు మనసులోని బాధ బయటకు పొక్కనీయకుండా "అదేమిటి దానవాచార్యా! నారాజ్యమునకు వారసు

లైన కుమారు లుండిరి గదా! వారిలో పెద్దకుమారుడు ప్రహ్లాదుడు బుద్ధిమంతుడు -విద్యావంతుడు—ధైర్యవంతుడు” అని యింకా చెప్పబోయాడు.

అవన్నీ తెలియక కాదు. నీకుమారుడు విష్ణుభక్తి విడనాడుట లేదని నీవును చెప్పావు కదా! మనము శైవులము. మన సాంప్రదాయానికి విరుద్ధంగా వైష్ణవమతాభిమానిని ప్రభువును చేయరాదు. ప్రహ్లాదు డెన్నివిధముల యోగ్యుడైనా యీయొక్క కారణంగా రాక్షసరాజ్యానికి రాజు కాదగిన వాడు కాడని నీకూ తెలియును—

నిజమే—అందుకని?

ఇపుడేమి చేయడం? నీకుమారులలో ప్రహ్లాదుని విడిచి రెండవవానికి యువరాజ్య పట్టాభిషేకము సేయుటయా?—లేక యిందులకుం దగిన వానిని యింకెవరినేని విచారించుటయా!

గురుదేవా! అట్లు జరగరాదు. నాస్వార్జితమైన యీ రాజ్యము నాకుమారు లుండగ—యింకొకరికి చెందుటయా! ఆమాటనకండి. అందులో నా పెద్ద కొడుకు ప్రహ్లాదుడు సామాన్యుడా!

ఆతని నెట్టులీ సింహాసనము నెక్కించెదవు?

తొందర పడకండి. ప్రహ్లాదునికి పట్టుమని పదేండ్లయినా నిండలేదు. చిన్ననాటి గుణములే పెద్దవయ్యాక నుండవు. ఎటులైనను నేనాతనిచేత హరినామ స్మరణ మాన్పింప పట్టుబట్టి యున్నాను గదా! యువరాజ్య పట్టాభిషేకానికి తొందరలేదు. వానిని పూర్తిగా శైవుని జేయుభారం నాది. మీరింక పోయి రండి” అన్నాడు.

ఆ మాటలోని కటువుతనం గూడా గమనించాడు శుక్రాచార్యుడు. ఐనా—అంతకన్న హిరణ్యకశిపుని యొత్తిడీ చేయరాదు. ఆత దెదురు తిరిగి నచో యెవరాతనిని సమాధాన పరచలేరు. అది గమనించ నందున శుక్రుడు లేచి "పోయివస్తా" నంటూ దారి పట్టాడు.

హిరణ్యకశిపుని మనసులో నున్న సమస్యనే యిపుడు దానవాచార్యుల వారు ప్రస్తావనలో బెట్టారు. కొడుకు హరినామ స్మరణ మానకపోతే వానికీ రాజపదవి చేకూరదు. కన్న కుమారునికి—పెద్దకుమారునికి రాజ్యసింహాసనం కట్టిపెట్టి యానందించాలనే తాపత్రయం రాక్షసేంద్రుని పీడిస్తూంది. ఈ పర్యా యము యింకేదయినా గట్టి ప్రయత్నం చేసి ప్రహ్లాదుని మార్చాలని యోచించుచుండ వానికొక యుపాయం తోచింది. అంతటితో తన ప్రయ త్నం ఫలించినట్లే ననుకున్నాడు.

## మహారాణి చెప్పిన మంచిమాటలు

మహారాణి మందిరానికి పోయిన హిరణ్యకశిపుడు "లీలా! నాకో చక్కని యుపాయం తోచింది. నేను విజయం పొంద బోతున్నా" నని సగ ర్వంగా అన్నాడు. లీలావతి పెనిమిటిని సమీపించి "అటులనా మహారాజా! తమ విజయం కన్నా మాకు కావలసిన దేమున్నది? ప్రభువుల కార్యక్రమ మేదియో మేము వినవచ్చునా!" అన్నది—మృదు మధురంగా—

వినిపించడానికే విచ్చేసినాము. మహారాణీ! ఆ నారాయణుడు పేరు చెందిన పెద్ద గారడి దొంగ–ఇంద్రజాల మహేంద్రజాల విద్యలతో యింత వరకు నా ప్రయత్నాల కడ్డువచ్చి మన కుమారుని కాపాడుతూ నటిఁచాడు. కాని యిక వాని యాటలు సాగవు. నేనిపుడే ప్రహ్లాదుని పిలిపించి "యెక్కడున్నాడా హరి?" అని అడుగుతాను. వాడు నిజం చెప్పి నాకా వైకుంఠుని చూపుతాడు. ఇంతకాలం నాకంటికి కనపడకుండా దాగుడుమూతలాడుతున్న నారాయణుని పట్టుకొని సంహరించి పారేస్తాను. అంతటితో మనవాడు నమ్ముకొని యున్న ఆ హరి నిజరూపం బయటపడి పోతుంది. ప్రహ్లాదుని మనసులో పెద్దకొండలాగా పీఠం వేసుకుని కూర్చున్న దేవదేవుడు నాచేతిలో నాశనమై పోవడం కన్నులారా చూచిన తర్వాత వాడే మారిపోతాడు. అంతటితో నేనా చక్రధారిమీద పగదీర్చుకొనడమే కాకుండ కుమారుని నాదారికి త్రిప్పుకొనిన వాడను కాగలన"న్నాడు.

ఆ మాటలకు లీలావతి సుముఖం చూపలేదు.

మాటాడవేం? అన్నాడు హిరణ్యకశిపుడు.

స్వామీ! తొందరపడుతున్నారు. విష్ణుమూర్తి అనంత శక్తిసంపన్నుండని మహాబలుడు లనుచున్నారు. మీరింతకాలం వెదికి కూడా ఆయనున్న గుట్టే తెలికొనలేక పోయారు. స్రోతకతను త్రవ్వుకొని పురుషోత్తమునితో పోరాటం బెట్టుకొను టెందులకు? నాకేమో భయముగా నున్నది. మీరీ ప్రయత్నం విరమించండి!" అని పాదములంటి నమస్కరించింది.

రాక్షసరాజు పకపకనవ్వి "ఏమిటి దేవీ! నీకు భయముగు చున్నదా! ఔను. ఆడువారు సహజముగ ధైర్యము లేనివారు. నేను మగవాడను. రణ ధీరుడను. బ్రహ్మ యిచ్చిన వరముల వలన మరణమే లేనివాడను. వీరపత్నివిగా నన్ను దీవింపదగిన నీవింత దీనాలాపము లాడెదవని తెలియక పొరబడ్డాను. అంతఃపురపులో కూర్చుని అమంగళాలని శంకించడానికి నాకాలస్యం లేదు. నేను పోవుచున్నా"నని రెండడుగులు వైచాడు.

"ఆగండి ప్రభూ! విజయహారతి నందుకొనండి" అంటూండగనే అంతఃపురదాసీ బంగారుపళ్ళెరంలో జ్యోతివెలిగించిన కుందినమరించుకొని వచ్చి రాణి చేతి కందించింది. లీలావతి దాని నందుకొని భర్తకు హారతినిచ్చి కన్నుల కద్దబోవునంతలో జ్యోతారిపోయింది. లీలావతి స్థంభించిపోయింది. అదంతా చూచిన హిరణ్యకశిపుని కోపం మరింత పెరిగిపోయింది. ఛీఛీ! శ్రద్ధలేని పనులు—శుభముగాని సూచనలు. ఊం. ఏమైతేనేం! నన్నాపకండి. అంటూ వేగంగ వెళ్ళిపోయాడు.

పతివ్రతయైన లీలావతి మగనిమాట కడ్డుచెప్పడం. మహారాజు "నేను పోవుచున్నా"ననడం—మాహారాణి వెనకకు పిలవడం—హారతారిపోవడము లన్నీ యపశకునాలే. ఏమికానున్నదో, యేమోనని తహతహ లాడుచున్న దాదులు యజమానురాలి నోదార్చి ధైర్యం చెప్పారు.

# నరసింహావతారము

అదిరాజభవనం. పరివారమంతా ఆయుధాల చేతబట్టుకొని యెవరి స్థానాలలో వారున్నారు. వడివడిగ నడచివచ్చి పీఠమలంకరించిన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని పిలిపించి "ఏమిరా! ఇవికడసారి మాటలు—నీవిప్పటికైన హరినామస్మరణ మానెదవా! లేదా!" అని గద్దించాడు. ప్రహ్లాదుడు హరినామ స్మరణ మాని నేనొక్షణమైన నుండజాలను నాన్నగారూ!" అని సవినయంగా పలికాడు.

రోషావేశంతో రాక్షసేంద్రుడు "ఎక్కడున్నాడురా నీహరి?" అన్నాడు.

ఆయన లేని చోటేలేదు— అంతటా తానే యున్నాడు.

ఇక్కడ గూడ నున్నాడా!

ఇక్కడ—అక్కడ ననక అణువు మొదలు బ్రహ్మాండము నందంతటను నిండి నిబిడీకృతమైయున్నాడు. ఈ స్థావరములలో—జగమములలో తానే యున్నాడు. జ్ఞానదృష్టితో చూడగల మహామునులముందే యున్నాడు. గర్వాంధకారంతో కనుగానని వారల వెన్నునంటే యున్నాడు నాన్నా!

నీలో నున్నాడా!

నాలో, నీలో, వీరందరిలో గూడ నున్నాడు.

ఈ రాతి స్తంభంలో గూడ వున్నాడా!

ఉన్నాడు—

నిజముగ నున్నాడా!

ముమ్మాటికి నిజముగనే యున్నాడు.

ఐతే చూస్తానంటూ హిరణ్యకశిపుడా రాతి స్తంభాన్ని కాలితోతన్నాడు అంతే. పెళపెళధ్వనులు మిన్ను ముట్టినై. స్థంభమును బ్రద్ధలుచేసుకొని నరసింహావతార మావిర్భవించింది. రాక్షసేంద్రుడాతనిని చూచి "మనిషివి కాకుండ—మృగానివీ కాకుండా యున్న నీవెవర"వని ప్రశ్నించాడు. నేనే శ్రీమహావిష్ణువును. నీవునరుని చేతిలోను మృగంచేతిలోను చావని వరం కోరి యున్నందున నిన్నంతమొందించడానికి నేనిలా సగం నరుడుగ—సగము సింహముగ నరసింహావతారం ధరించి వచ్చా"నన్నాడా నారాయణుండు.

నన్ను చంపగల మహాయుధం నీ దగ్గర నున్నదా! అన్నాడు దైత్యేంద్రుడు.

నాకదీ తెలియును. ఏయాయుధం చేతనూ మరణింపవు కనుక నిన్ను నావాడి గోళ్ళతో చీల్చి చంపడానికే వచ్చాను. నాతో పోరాడకోరు తున్నావు కదూ! సిద్ధంగనున్నావా!" యనిన నరసింహమూర్తితో హిరణ్యకశిపుడు "ఔను. ఎంతకాలంనుండో నిన్నెదిరించడానికే చూచుచున్నాను. ఆలస్య మెందుకు! యుద్ధానికి ర"మ్మని కలియబడ్డాడు. వారికి గోరమైన ముష్టి యుద్ధం జరిగింది. అదిచూచిన వారంతా భయభ్రాంతులయ్యారు. అప్పటికి

సూర్యాస్తమయింది. అదిగమనించిన నరసింహామూర్తి తన బలమంతా చూపి వానిని రెండుచేతులతో బంధించి యిల్లూ—బయటగాని—వాకిలి గడపమీద కూర్చొని దానవుని తొడలపై పరుండ బెట్టుకొని పగలు రాత్రిగాని సంధి కాలంలో చేతి గోళ్ళు గ్రుచ్చి రాక్షసుని గుండెలు చీల్చాడు.

హిరణ్యకశిపున కపుడు పూర్వజన్మ స్మృతి కలిగింది.

నారాయణా! నీవు సాక్షాద్విష్ణుమూర్తివి. నాతమ్ముడును వైకుంఠమున మీ ద్వారముగాచు జయ విజయులము. మునుల శాపంబున మాకీ జన్మలు వచ్చి మిమ్మింతగా ద్వేషించితిమి. ఈనాటితో నాయీ మొదటి జన్మ ముగియు చున్నది. మిగిలిన రెండు జన్మలను గూడ తొందరలో కడదేర్చి మమ్మ తిరిగి మీ సన్నిధికి చేర్చుకో స్వామీ!" అంటూ నమస్కరించి ప్రాణాలు విడిచాడు. నరసింహమూర్తి "భక్తాగ్రణీ! నీ సంకల్పం ఫలిస్తుం" దంటూ వాని ప్రేవులు దీసి హారాలుగా మెడలో వేసుకున్నాడు.

కీర్తించుచు చుట్టుమూగిన దేవమునీంద్రులకు నరసింహస్వామి అభయ ప్రధానమిచ్చాడు. లీలావతికి ముక్తి ప్రసాదించాడు. ప్రహ్లాదుని చిరంజీవిగాదీవించి రాజ్యాభిషక్తుని గావించాడు. దేవతలంతా స్వామిమీద పూలవాన గురిపించారు. జయజయనాదాలు దిక్కులలో ప్రతిధ్వనించినై. రంభాది వేశ్యలు నృత్యం చేశారు. నారదతుంబురులు గానం చేశారు. ముత్తయిదువుల కర్పూర హారతులతో వెలుగు ప్రకాశించింది. ప్రహ్లాదుడు చిరంజీవి యయ్యాడు.

# వేదగిరి చరిత్రము

అటుతరువాత నరసింహమూర్తి బయలుదేరి వచ్చి వేదగిరి మీద నిలిచాడు. అప్పుడు స్వామి ననుసరించిన భక్తులిచటకు వచ్చారు. నృసింహమూర్తి ప్రహ్లాదునితో "వత్సా! ఇది వేదములచే నిర్మింపబడిన వేదగిరి పేరు దాల్చిన పవిత్ర స్థలం. నేనిక్కడనే స్థిరనివాస ముండ దలంచాను. నీవును యీకొండమీదనే తపమొనరింపుము. నాసన్నిధానము నందున్నవాడ వయ్యెద" వనిన బాలభక్తుడు "చిత్త" మని తలవంచాడు.

వేదగిరికి ఐదు క్రోసుల దూరంలో వెంకటగిరి యనునొక మునినివాస క్షేత్ర మున్నది. అది కొండమీద నొక దట్టమైన యడవి యందున్నందున ప్రజలకు సామాన్యముగా కనపడునది కాదు. అదొక గుహమాత్రమే. ఆ గుహయందెందరో మహాఋషులున్నారు. ఆ ఋషులు అర్ధమరేయివేళ యెవరికిని కనపడకుండ వచ్చి యీ నరసింహస్వామిని సేవించి పోతుంటారు. మునులు మానవ దృష్టికి కనపడక పోయినా వారు దేవార్చనలో మ్రోయించిన ఘంటా నాదం విన్నవారు చాలమంది యున్నారు. వారికపుడు మృదంగ నాదం కూడ వినబడేదని ప్రతీతి.

మరికొందరు రాత్రికాలంలో మునులు నరసింహమూర్తిని పూజించి నప్పటి పూలు-పత్రి వగైరా పూజా ద్రవ్యములను మరునాటి యుదయమున

చూచినట్లు—మును లాప్రదేశంలో సంచరించిన అడుగుజాడలను పోల్చు కొనినట్లు కూడా చెప్పుచున్నారు.

సహ్యాద్రి మీద నుదయించిన కృష్ణానది తూర్పుముఖంగా ప్రవహి స్తూంది. నదీ తీరానికొక కోసు దూరంలో ముక్తిపుర మనుచోట నీవేద్రాద్రి యున్నది. ఈ కొండమీద భరద్వాజ మున్యాశ్రమ మున్నది. ఋష్యశృంగ మహాముని పదివేల సంవత్సరాలు తపమాచరించిన పుణ్యస్థలం. వేదగిరియను పదం కాలక్రమేపి ప్రజావాడుకలో యాదగిరిగా మారింది.

రుష్యశృంగముని చాలగొప్పవాడు. ఆయన మహాతపస్వి. జీవితంలో చాలకాలం ఆడవారిని కంటితోనైన చూచియుండలేదు. పెద్దపెద్ద తుఫానులు వచ్చిన ప్రమాదాలలో గూడ చలింపక తపసు చేసినందున వాని తలమీదొక కొమ్ము మొలిచింది. మునులలో కొమ్ము కలిగిన వాడైనందున వాని నం దరూ రుష్యశృంగు డన్నారు. ఆయన తపోదీక్ష కానందించిన విష్ణుమూర్తి ప్రత్యక్షమై "మహామునీ! నీభక్తి నిరుపమాన మని నేను గ్రహించాను. నీ వడిగిన వర మిస్తాను. నీకేం కావాలి?" అన్నాడు.

రత్నకిరీటంతో—కౌస్తుభమణి హారంతో—పట్టు పీతాంబరంతో—శంఖ చక్రగదాయుధాలతో కట్టెదుట నిలవంబడి కరుణించిన స్వామికా రుషి సాష్టాంగ దండప్రణామంబు లాచరించిన తరువాత "దేవదేవా! నాకు సంసార సుఖానందాలమీద కోరికలేదు—రాజభోగాలమీద భ్రాంతియు లేదు. నాకు కావ లసిన దొక్క మీపాద సేవ మాత్రమే. నేనింత కాలము తపమాచరించిన ఈ కొండ మీద మీరు వేంచేసి యుండడం—మీసేవ నేననుదినం చేయగల్గడం—

ఇది యొక పవిత్ర యాత్రాస్థలంగా మారడమే నేను కోరుకొనిన వర" మని విన్నవించుకున్నాడు.

పద్మనాభుడు పరమానంద భరితు డయ్యాడు. "ఋష్యశృంగా! నీవడి గిన వరమిచ్చాను. కొద్ది రోజులలో నేను నారసింహావతార మూర్తినై నీకిక్క డనే దర్శన మిస్తాను. నీవపుడిక్కడ నన్ను ప్రతిష్ఠ చేయి. ఈ వేదగిరిమీద నేనుండి భక్తుల పాలించుచు నీ యభిసంధి నెరవేర్పగల" నని చెప్పి యదృశ్య మయ్యాడు.

ఆనాడు మునికిచ్చిన మాట దప్పక హిరణ్యాక్షుని చంపిన కోప జ్వాలల తోడనే నరసింహమూర్తి వేదాచలం మీదకు రాగ ఋష్యశృంగుడా దేవదేవునకు సాగిలబడి మ్రొక్కి "స్వామీ! నాజన్మ తరించింది. నా సంక ల్పం ఫలించింది. మీపాదసేవాభాగ్యం నాకిక మీద ప్రత్యక్షంగా ప్రాప్తిం చిం" దంటూ వేదాచలం మీద నృసింహ ప్రతిష్ఠ చేశాడు. అప్పటినుండి శ్రీమన్నారాయణుం డిక్కడ వేదగిరి నరసింహమూర్తిగా ప్రఖ్యాతి గాం చాడు.

వేదగిరి యొక నృసింహ క్షేత్రంగా ప్రబల మయింది.

నరసింహ క్షేత్రము లైదింటితో యాదగిరి ప్రముఖ స్థానం పొందింది.

స్వామి యిచట పంచాకృతులతో దర్శన మిస్తున్నాడు.

# నాలుగు మూర్తుల నరసింహస్వామి

యాదగిరి మీద వెలసిన స్వామి యైదురూపములతో సాక్షాత్కరించు చున్నందున నిది నరసింహ పంచక్షేత్రమనియు చెప్పబడుచున్నది. వానికి నరసింహమూర్తి, సాలగ్రామ నరసింహమూర్తులను పేర్లు కలిగినవి.

ఉగ్ర నరసింహమూర్తి ఈకొండమీద యెక్కడున్నదియు చూచిన వారు లేరు. ఎవరికినీ కనపడనందున పేరుచెప్పుకొనుట దప్ప దర్శనము లేదు. ఆమూర్తి ఆరాధనాదుల కనుకూలము లేవని ప్రమాణ మున్నది అందు వలన మనము చెప్పుకొనదగినవి-సేవింప దగినవి నాలుగు మూర్తులు మాత్రమే.

జ్వాలానరసింహమూర్తికి ఋష్యశృంగముని ప్రతిష్టించినందున యోగానంద నరసింహ మనియు నామాంతర మున్నది. ఇది గుహయందు కలదు. హిరణ్యకశిపున వధించినపుడా విర్భవించిన రోషజ్వా లప్పటికి యుపశమనములు కానందున యీ స్వామిని జ్వాలానరసింహమూర్తి అన్నారు.

గండభేరుండ నరసింహమూర్తి మారుదిశలలో వెలసియున్నది. రెండు తలలున్న పక్షిరూపంబున నున్న యీస్వామి చతుర్విధాకారములతో సాక్షాత్కరించుచున్నాడు.

యాదగిరి నరసింహమూర్తి

సాలగ్రామ నరసింహమూర్తి ప్రహ్లాదునిచే ప్రతిష్ట చేయబడినది. హిరణ్యకశిపుని మరణానంతరం ప్రహ్లాదుడు కొంతకాలం రాజ్యం పాలించాడు ఆసమయంలో శత్రురాజుల మీద యుద్ధాలుచేసి విజయం సాధించాడు. రాజ్యం పాలించే రోజులలో తరచుగ వేదగిరి నరసింహమూర్తిని దర్శించి సేవించి పోతుండేవాడు. అటు తరువాత రాజ్యం కుమారుల కొప్పగించి వచ్చి యాదగిరి నందేయున్న యొకచిన్న చోటుమీద తపస్సుచేసి నందున దానికి ప్రహ్లాదుని కొండ యనే పేరు వచ్చింది.

యాదగిరే గాక అహోబిలము, సింహాచలము, మంగళగిరి మొదలైన స్థానాలెన్నో నృసింహక్షేత్రములై ప్రసిద్ధి గాంచినవి. స్వామివారి దేవేరి పేరు లక్ష్మి. నరసింహమూర్తి లక్ష్మి నరసింహస్వామియై భక్తిపాలన చేస్తున్నాడు.

నరసింహమును గురించిన చెంచులక్ష్మి కథ యొకటున్నది.

ఆదిలక్ష్మిదేవి యంశతో అడవిజాతి పిల్లగ చెంచులక్ష్మి పుట్టుతుంది. హిరణ్యకశిపుని చంపిననాటి క్రోధావేశ తపనతో కాలునిలకడలేక దేశదేశాలు తిరుగుతూన్న నరసింహమూర్తినా చెంచులక్ష్మి తాకి పలుకరించగనే వానికి ప్రశాంతి కలుగుతుంది. నరసింహం చెంచులక్ష్మిని ప్రేమించి పెండ్లాడుతాడు. అంతలో ఆదిలక్ష్మి వస్తుంది. సవతుల కయ్యం జరిగేది చెంచులక్ష్మి కథ.

# నరసింహక్షేత్ర మహాత్మ్యము

వేదాచలం మీద వేంచేసిన స్వామిని ముక్కోటి దేవతలు, మునిబృందాలు, శంకరుడు, దేవేంద్రుడు మొదలైన వారంతా సేవించి నరసింహమూర్తి దీవెనలు పొందారు. శంఖ చక్ర రేఖలతో పవిత్రములైన నరసింహస్వామి పాదపూజ చేయుటకు ముందుగా బ్రహ్మదేవుడు కమండలోదకం దెచ్చి పాదములు కడిగినపుడు కాలువగట్టిన నీరా క్షేత్రమందున్న జలాశయంబులలో కలిసినందున యాదగిరి క్షేత్రకుండము లన్నియు మహా పవిత్రములై యాత్రికుల పాపముల నశింపజేయుచు మంచి ఫలితంబుల నిచ్చుచున్నవి.

క్షేత్రజలాశయములలో విష్ణుకుండము ప్రసిద్ధమైనది.

ఆదియందు యాదగిరి నరసింహమూర్తి అనుగ్రహమున యాత్రికుల కొరకై నియమింపబడిన ఏగట నీ విష్ణుకుండము పాటిలేనిదని చెప్పబడుచున్నది. కలియుగంబున నీ జలాశయములో యాదముని స్నానమాచరించినందున ఋషికుండమనియు ప్రసిద్ధి కెక్కినది. కుండములోని నీరంతయు నొకటిగ నుండక రెండు పాయలై కనపడుచు త్రాగుటకు అమృతము వలె నున్నది.

ప్రతిదినము రాత్రికాలము లందీ జలాశయమున నొకజ్యోతి ప్రకాశించుచున్నది. ఆశ్రయించిన భక్తాదులు కది వెలుగుచూపు జ్ఞాన చిహ్నముగ భగవత్సంకల్పము చేతనే ప్రకాశించుచున్నదని పౌరాణికుల నమ్మకం. ఆ జ్యోతి దర్శన మాత్రమున బ్రహ్మహత్యాది పంచమహా పాతకములైనను హరించి మోక్షముపొంద వెలుగుబాటనిచ్చు చున్నది. హనుమంతుడు స్వామి నామస్మరణము నీ విష్ణుకుండము చెంతనే నిలిచిపోయాడు.

ఎవరైననుగాని భక్తి నమ్మకములు కలిగి నలుబది దినము లిచట నియమంబుల దప్పక విష్ణుకుండమున స్నానముచేసి ఆంజనేయస్వామికి ప్రదక్షిణములు చేసిన యెడల వారి గ్రహపీడలు హరించి, మహామారి మొదలైన క్షుద్రదేవతల భయములేక పూర్ణాయురోగ్యములను పొందెదరు. తరతరములనాటి దరిద్రమైనను తొలగి సకల సంపదలు కల్గుట యందు సందేహము లేదు. రకరకములైన సిద్ధులును వారికి లభింపగలవు.

యాత్రికులు, భక్తులు కృష్ణానదిలో స్నానమాచరించి స్వామిని దర్శించి క్షేత్రపాలకులను సేవించి క్షేత్రోపవాసం గడపి మరుదినంబున శక్తి కొలది దానధర్మములు సేయవలయును.

జ్వాలా నరసింహ స్వామికి పుట్టను పూజించి పుట్టలో పాలు పోయు వలయును.

సాలగ్రామ నరసింహమూర్తికి కృష్ణాజలాల స్నానం చేయించి పూజింప వలయును.

యోగానంద నరసింహ స్వామిని దర్శించి పూజించి కానుక లర్పింప వలయును.

లక్ష్మి నరసింహంనకు—వీరనరసింహనకును పూజలు చేయించి ప్రణమిల్ల వలయును.

ఈ క్షేత్రములో స్వామికి చేసిన ప్రదక్షణము భూప్రదక్షణముతో సమాన మైనది కావున నరసింహస్వామి భక్తులకు మంచిసంతానం కలిగి, వృత్తి వ్యాపారాలలో విజయం సిద్ధించి, కోరికలుదీరి, అంత్యమున మోక్ష ప్రాప్తి కాగలదని మహానీయులు తెలుపు చున్నారు.

# సీతారాముల కళ్యాణము

పూర్వం సూర్యవంశంరాజులు సాకేతపురం రాజధానిగ అయోధ్యను పాలించారు, వారిలో ఇక్ష్వాకు మొదటివాడు. నృగువు మరుత్తు అంబరీషుడు, కకుత్థ్సుడు పృధువు యువనాశ్వుడు బృహదశ్వుడు మాంధాత పురుకుత్సుడు అరణ్యుడు త్రిశంకువు హరిశ్చంద్రుడు సగరుడు అంశుమంతుడు దిలీపుడు భగీరధుడు రఘువు అజుల తరువాత దశరధుడు ప్రభువై ప్రజలను పాలిస్తు న్నాడు.

దశరధ మాహారాజుకు సంతానంలేదు. ఆయనకు కౌసల్య పట్టపురాణి-సుమిత్ర, కైకేయి యనువారలు భార్యలు వీరుగాక యింకను యెందరో వున్నారు. చివరకా మహారాజు పుత్రకామేష్టియజ్ఞం చేయగ కౌసల్యయందు శ్రీరాముడు, సుమిత్రయందు లక్ష్మణ—శత్రఘ్నులు. కైకేయియందు భరతుడు ననువారు నలువురు కుమారులు కలిగారు. వారంతా పెరుగుతున్నారు-దశరధునకు రామునిమీద మమకార మెక్కువ.

సూర్యవంశపు రాజులకు కులగురువు వశిష్ఠ మహాముని.

రామలక్ష్మణ భరత శత్రఘ్నులు సుధన్వాచార్యుల వారి యొద్ద శుశ్రూషలు చేసి సకలవిద్యలూ నేర్చారు. రాముడనిన తమ్ములకమిత భక్తి-రాముడుగూడ తమ్ముల ననురాగంతో చూచేవాడు. రాముని రూపం—నడవడి-విద్య—వినయం పురప్రజలలోను గౌరవాన్ని సంపాదించు కొనినై. అన్నదమ్ములు నలువురు పదునాలుగేండ్ల ప్రాయము వారయ్యారు.

ఒకనాడు విశ్వామిత్రముని రాగా దశరధ మహారాజా యనను సదుపచారాలతో గౌరవించిన తరువాత "మీరు వచ్చిన పని యేమిటి?" అని యడిగాడు. విశ్వామిత్రు డంతట "దశరధా! దండకారణ్యంలో నేనొక మహా యజ్ఞం ప్రారంభించాను. మారీచుడు సుబాహుడు అనే దానవులు వచ్చి నా యజ్ఞం జరుగకుండ అంతరాయాలను కలిగించుచున్నారు. వారిని చంపి నాకు సాయం చేయుటకు మీరాముని నావెంట పంపించు" మని కోరాడు.

రాముడంటె దశరధునికి పంచప్రాణాలు. రాము నడవికిపంపితే రాక్షసులను చంపలేక పోవడమే కాకుండా వానికేం యపకారం జరుగతుందో నని

భయమొకవంక పీడించుచుండగ విశ్వామిత్రుని మాట కాదంటే ఆయనేం శపించునోనన్న భీతితో నలకడ పడిపోయాడు. దశరధుడు అదంతా గ్రహించిన వశిష్ఠముని "రాజా! సందేహింప వలదు. నిజానికి విశ్వామిత్రుడంటే నాకు గిట్టదని నీకును తెలియును. అట్టినేనే చెప్పుచున్నాను. మన రామునకు మేలు జరుగ బోవుచున్నది. గాధినందనుని వెంట వానిని పంపుమని ధైర్యం చెప్పాడు. దశరధుడు కాదనలేక పోయాడు. ఎందులకైనా మంచిదని రాముని లక్ష్మణుని తోడుచేసి విశ్వామిత్రుని వెంట యిద్దరినీ పంపించాడు.

రామలక్ష్మణులను వెంటబెట్టుకొని తన మున్యాశ్రమానికి పోయిన విశ్వామిత్ర మహాముని వారిద్దరికీ బల—అతిబల అనే విద్యలను నేర్పాడు. వారికింకా చెప్పదగిన విషయాల నన్నింటిని చెప్పాడు. బలాతిబల విద్యలు నేర్చిన వారికి ఆకలిదప్పిక లుండవు. యుద్ధములలో అలసటరాదు. అపజయం కలుగదు. రామలక్ష్మణులు బాణములు పట్టి కాచియుండగ విశ్వామిత్రుడు యజ్ఞం ప్రారంభించాడు. యజ్ఞం భంగం చేయడానికి తాటకవచ్చి భయంకరంగా గర్జించింది.

రాము డొక్క బాణంతో తాటకను గొట్టి చంపాడు.

తాటక చేసిన ఆర్తనాదం వింటూనే ఆమె కొడుకులు మారీచ సుబాహువు లను రాక్షసులు వచ్చి రామలక్ష్మణుల మీద తారసిల్లారు. వారి కపుడు సంగ్రామం జరిగింది. ఆయుద్ధంలో సుబాహుడు వెంటనే చనిపోయాడు. మారీచుడు మూర్ఛపడ్డాడు. రాజకుమారులకు జయం లభించింది. విశ్వామిత్రుని యాగం పరిసమాప్త మయింది.

అదే సమయాన మిథిలా నగరంలో జనక మహారాజు తన కుమార్తెకు స్వయంవరం జరుపుతూ ఆహ్వానం విశ్వామిత్ర మహామునికి గూడ పంపించాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటబెట్టుకొని మిథిలకు పోయాడు. జనకుడు వారి ముగ్గురను గౌరవించి మర్యాదలు చేయించాడు. సీతా స్వయంవరానికి దేశదేశాల నుండి రాజకుమారులు వచ్చారు. నగరం మనోహరంగా నలంకరింప బడింది.

రాజకుమారు లంతా స్వయం వరశాలలో బంగారు గద్దెల మీద కూర్చున్నారు.

వారిలోనే రామలక్ష్మణులు—విశ్వామిత్ర ముని యున్నారు.

కొంతసేపటికి రాజసేవకులొక చిన్నిచిన్ని చక్రాల పెద్దబండిని త్రోసికొని వచ్చి సభామధ్య భాగంలో నిలిపారు. ఆ బండిమీద నొక గొప్ప ధనస్సు నమర్చబడి యుంది. దానిమీద కప్పియుంచిన పట్టు వస్త్రమును వారపుడు తీసివేశారు.

జనకమహారాజు వచ్చి సభకు నమస్కరించిన తరువాత "రాజకుమారులారా! పూర్వం శంకరుడు తారకాసురుని చంపినపుడుపయోగింపబడినదీ ధనస్సు. శివుడు శూలపాణి కావున యీవింటిని భూమిమీదనే విడిచిపెట్టి కైలాసానికి తిరిగి పోయాడు. నేను దీనిని జాగ్రతగా తీసికొని వచ్చి నాయింట నుంచాను. ఇపుడు వరింప బోవుచున్న నా పెద్దకుమార్తె యీ ధనస్సు నవలీల నెత్తుట నేను చూచితిని. ఆమెచే నెత్తబడిన ఈచాపము నెత్తి

యెక్కు బెట్టిన వానిని నా పుత్రిక యైన సీత వరింపనున్నది. మీలో సమర్థు లైన వారు స్వయంవరంబున పాల్గొన వలయు నని" నా ప్రార్థన అన్నాడు.

సభలోని రాకుమారులు చాల మంది లేచి ప్రయత్నించారు కాని వారా బాణము నెత్తలేక పోయారు. చివకు ముని దీవెనలు పొందిన శ్రీరామచంద్రుడే శివచాపమును సునాయాసంగా యెత్తి నారి సారించుచుండ చాలకాలము నాటి దగుట నది నడిమికి యిరిగి పోయింది. ఇదొక విధంగా అశుభసూచక మైనప్పటికి విల్లునెత్తినందున సీత రామునే వరించింది. ఆ శుభవార్త విని దశరథుడు బంధు మిత్ర పరివార కవి గాయక వందిమాగధ పురోహితాదులతో మిథిలానగరానికి తరలి వచ్చాడు. సంబంధ బాంధవ్యాలు కలిసినై. ఒకరి కొకరు వియ్యాల వారయ్యారు.

జనకమహారాజు తనకు దొరకిన పెంపుడు కుమార్తె యైన సీతాదేవిని రామున కిచ్చి కల్యాణం జరిపించి నపుడే తన కుమార్తె యూర్మిళను లక్ష్మణునకు, తన తమ్ముని పుత్రికలలో మాండవిని భరతునకు, శ్రుతకీర్తను శత్రుఘ్ననకు యిచ్చి వివాహాలు చేయించాడు. దశరథ మహారాజు మహానందంతో నలువురు కుమారులు—నలువురు కోడండ్రతో అయోధ్యానగరానికి తిరిగి వచ్చారు. అందరూ సుఖంగ వున్నారు.

# శ్రీరామ వనవాసము

సీతారాముల పెండ్లి జరిగి పదునొకండేండ్లు గడచినై.

దశరథ మహారాజు రామునికి రాజ్య పట్టాభిషేకం చేయాలని లగ్నం నియమించాడు. పట్టణమంతా అలంకరించారు. అంత తొందరలో రామునికి పట్టాభిషేక మని యెవరూ అనుకొనలేదు. తెల్లవారితే ముహూర్తమనగా దశరథుడు కైకేయికి చెప్పాలని ఆమె మందిరానికి పోయాడు. ఈ సంగతి యింతకు ముందే కైకేయికి ఆమె స్నేహితురాలు మంథర వలన తెలిసింది.

మంథర చాల తెలివితేటలు గలది. కైకేయిని అత్తవారింటికి పంపేటప్పుడు కైకేయి మహారాజు కుమార్తె వెంట మంథరను అరిదెవు దాసిగ పంపించాడు. పసితనంలో కైకేయి మంథర లిరువురను మంథర తల్లి దగ్గర చనుబాలు త్రాగి పెరిగిన స్నేహం వారిసంది. రామపట్టాభిషేకం జరుగ బోతున్న వార్త వినినంతనే మంథర వచ్చి కైకేయితో "ఏమమ్మా! దశరథ మహారాజు నిన్ను పెండ్లాడ బోయేటప్పుడు మీ తండ్రిగారితో కేకయ మహారాజా! నీకుమార్తె యందుదయించిన కుమారునికే నేను నారాజ్య సర్వస్వమూ యిస్తా" నని యొప్పుకున్నాడు గద! ఏనాడో మన భరతునకు వాగ్దత్తమైన ఈరాజ్య మిప్పుడు రాముని గట్టపెట్టుటేమి?" అని ప్రశ్నించింది.

ఔను. భరతుడు పుట్టకముందే యిది భరతుడకు చెందెలాగా నిర్ణయమయింది—యిపుడు రామునకు చెందడంలో యేదో తంతు లేకపోలేదు. అదీగాక భరత శత్రఘ్నులు మేనమామల యిండ్లయెద్దనుండగ వారిని పిలువకనే అన్నకు పట్టాభిషేకమా! ముహూర్తము సమీపించుచున్నను యీవార్త అంతఃపురమునకే తెలియకుండుటయా! అని యోచించిన కైకేయికి గూడ మనసు చివుక్కు మన్నది. మహారాజే యింత కపటం బెట్టుకొన్నపుడు తనుమాత్రమేల యెదిరించరా"దని నిశ్చయించుకుంది కైకమ్మ.

తన మందిరానికి వచ్చిన దశరథునితో కైకేయి "మహారాజా! పూర్వం దేవేంద్రుని తిమిధ్యజునికి యుద్ధం జరిగింది. ఆయుద్ధంలో మీరు దేవేంద్రుని సాయం చేయబోతూ నన్ను రథం మీద నెక్కించుకుని పోయారు. యుద్ధసమయంలో మీరు మూర్ఛపోయారు. నేనపుడు మీప్రాణములను కాపాడాను. మీరు సంతోషించి నాకు రెండువరము లిచ్చారు. నేనపుడు వానిని పుచ్చుకొనలేదు. యిప్పుడడుగుచున్నాను. మొదటి వరం రామచంద్రుడు పదునాలుగేండ్లు దండకారణ్యంలో నివసించడం—రెండవ వరం భరతుని యీ కోసల రాజ్యపట్టాభిషేకం చేయించడం. అంతే"నని నిర్మొగమోటంగా చెప్పేసింది.

చేసిన ప్రయత్నాలన్నీ నిలిచి పోయినై.

రాముడు తనభార్యయైన సీతాదేవిని—తమ్ముడైన లక్ష్మణుని వెంటబెట్టుకుని తెలతెలవారుచుండగనే నగరంవీడి దండకారణ్యాలకు పోయాడు. గంగానదిని దాటిపోయి పంచవటి ప్రాంతంలో ఆకుటిల్లు నిర్మించుకొని అందులో కాపురముంటున్నారు. తరువాత భరతుడు మొదలైన వారు వచ్చి

తిరిగి యయోధ్యకు రమ్మని పిలిచినా రాముడు నేనీ పదునాలుగేండ్ల గడవు లోపల రా"నని చెప్పడం జరిగింది.

దండకారణ్యం రాక్షసులది. అది ద్రావిడరాజ్యం. దానికధిపతి లంకనే లుయున్న రావణబ్రహ్మ. రాముడిపుడాక్రమించిన భాగం రావణుడు తన చెల్లెలు శూర్పణఖ కరెణంగ యిచ్చిన రాజ్యం. రాముడు ఆర్యులకు సంబంధించినవాడు. నిజానికి ద్రావిడ రాజ్యంతో ఆర్యుల కెటువంటి అధికారమూ లేదు. రాముడిక్కడకు వచ్చినంతనే ఆర్యులకు సంబంధించినవారై దురాక్రమణగ దండకారణ్యంలో చేరిన మునీంద్రులంతా రాముని ప్రోత్సహించి రాక్షసుల కన్యాయాలను చేయించారు. పైగా రాక్షసుల మీదనే అభండాలు మోపారు. చెప్పరాని దుర్మార్గులుగా ద్రవిడ జాతినెత్తి తూర్పార పట్టారు.

శూర్పణఖ పెనిమిటిని కోల్పోయిన మందభాగ్యురాలు. ఆమె తన యేకైక కుమారుడు జంబుకుని మీదనే ప్రాణాలన్నీ పెట్టుకుని బ్రతుకుతూంది. జంబుకు డెవరి జోలికిపోకుండ తన దేశంలో తానొక పొదలో గూర్చుండి తపసు చేసికొనుచుండగ అసూయాద్వేషములతో మునులు లక్ష్మణునికి మాయమాటలు చెప్పి వానిని పంపించారు. అదేమిటని యడుగవచ్చిన శూర్పణఖ మనసు తెలియక లక్ష్మణుడామె ముక్కుచెవులు కోశాడు. ఇంకా ఆమెనవమానాల పాలుచేశాడు.

లంకలోనున్న రావణున కివన్నీ తెలిసినై.

రాముని తన దగ్గరకు రప్పించుకొని మాటాడాలనుకొన్నాడు.

కాని రాముడు తన దగ్గరకు రావాలన్నా మునులు రానీయరని తెలియును గనుక ముందుగా సీత తనయింట చిక్కుబడియున్న యెడల రాముడు తప్పక రాగలడని నమ్మి మాయోపాయంతో రామలక్ష్మణు లింటలేని సమయాన సీత నెత్తుకొనిపోయి తనలంకలో అశోకవనంలోనుంచి ఆమెకేలోపం రాకుండ చూచుచున్నాడు. కాని రాముడు తాననుకొన్నట్లు రాకపోగా వాని తలంపు—ధ్యేయం—మార్గం కూడా వ్యతిరేకించినై.

రామలక్ష్మణులు సుగ్రీవుడను వానరునితో స్నేహం చేశారు. వాలి సుగ్రీవులను వారన్నదమ్ములు. వాలి సుగ్రీవుని భార్య రుమనపహరించి సుగ్రీవుని వెళ్ళగొట్టాడు. అన్న నెదిరింపలేని సుగ్రీవుడు రుష్యమూకాద్రి మీద కాచుకొని యుండి రామునితో రాయబారం చేశాడు. సుగ్రీవుని మేనల్లుడైన ఆంజనేయుడు రాముడు వాలినిచంపి సుగ్రీవుని భార్య రుమతోబాటు వాలిభార్య తారను గూడ సుగ్రీవునకు వశపరచి కిష్కింధకు రాజును చేయునట్లును—సుగ్రీవుడు తన వానరబలగంతో గూడ లంకను ముట్టడించి రావణుని చంపి సీతను రామున కొప్పగించు లాగునను యొడంబడికలు చేయించాడు.

వానరులంతా రామదండులో చేరారు.

# బ్రహ్మ హత్యాపాతక నివారణము

రాముడి కపులతో లంకమీదకు దండెత్తి పోవుటకు నూరు యోజనాల సముద్ర మాటంకమయింది. విశ్వకర్మ కుమారులైన నల నీలాచార్యులను శిల్పి బ్రాహ్మణుల సాయం రాముడు కోరాడు. వారు వాస్తుశాస్త్రం, యుద్ధ శాస్త్రం, ధర్మశాస్త్రంలోను ఆరితేరిన ఉద్దండ పండితులు. నీలాచార్యుడు రామ సైన్యాని కంతకూ సర్వసైన్యాధిపత్యం వహించాడు. నలుడు సముద్రం మీద వారధి నిర్మించాడు. రామ బలగమంతా సుఖంగ లంకను చేరుకుంది.

రావణుని తమ్ముడు విభీషణుడు వచ్చి రామపక్షం చేరాడు.

రామరావణ సంగ్రామం జరిగింది. నిజానికి రావణుడు బలవంతుడే. కాని తన తమ్ముడు తనన్నుండి చీలిపోయి పరాయివారికి యింటిగుట్టు చెప్పి నందున తనకు చేటు తప్పలేదు. రాముడు లంకలోని రాక్షస వీరులను, రావణబ్రహ్మను గూడ చంపి విజయం సాధించాడు విభీషణుని కిచ్చిన మాట ప్రకారంగా వానిని లంకకు పట్టాభిషిక్తుని చేశాడు. సీతను చేరదీశాడు. అందరినీ వెంటబెట్టుకొని అయోధ్యకు వచ్చి రాజ్య పట్టాభిషేకం చేసుకున్నాడు. ప్రజలలో రామరాజ్యమని ప్రసిద్ధి సంపాదించు కున్నాడు.

కాని రాముడిప్పుడు మొదటి రాముని వలె లేడు.

రామునిలో మందమతి యేర్పడింది. ఒక్కొక్కసారి యేవేవియో మాటాడుతున్నాడు. ఊరకనే భయపడు తుంటాడు. కడుపునిండ అన్నం తినడం లేదు. కంటినిండ నిద్రపోవడం లేదు. ఒక్కొక్కసారి తనలో తాను నవ్వుకొనడం, మాటాడుకొనడం, దయ్యాలను, భూతాలను చూచినట్లుగా భ్రమించడమంతా గ్రహించిన కౌసల్యాదేవి భయపడి పోయింది. వశిష్ఠ భగవానుని పిలిపించి "మారాముడిట్లయిన కారణమేమిటి! దీనికి నివారణోపాయమేమి" టని యడిగింది.

వశిష్ఠముని యామెతో "అమ్మా! రావణుడు బ్రహ్మవంశము వాడు. రాక్షసులంతా పుట్టుకచే బ్రాహ్మణులే. రామచంద్రుడు వారినందరను చంపినందున బ్రహ్మహత్యా పాతక మావరించింది. ధనుష్కోటిలో రామలింగ ప్రతిష్ఠ చేయుటచే కొంత హరించినా మిగిలిన పాపఫలం వలన నిట్లగుచున్నది. దీనికి నివారణోపాయం లేకపోలేదు. కాల పురుష దానమంటారు. అనగా రామునంతయెత్తు పొడవులు గల బంగారు విగ్రహమును చేయించి దానిని ధనధాన్య వస్త్ర దక్షిణ తాంబూలాదులతో నొక బ్రాహ్మణునకు దానమిచ్చిన యెడల రాముడు గ్రహణము నుండి విడిపోయిన చంద్రుని వలెనే కళంకమును లేక హాయిగా నుండగల" డని చెప్పి స్వస్తత కలిగించాడు.

కౌసల్యాదేవి బంగారంతో రామవిగ్రహం చేయించింది.

వశిష్ఠుడు కాలపురుష దాన వ్రతం చేయించాడు. కాని దానం పట్టే బ్రాహ్మణు లెవ్వరూ ముందుకు రావడంలేదు. ఎన్ని హోమాలు చేసినా, ఎన్ని శాంతులు జరిపించినా, ఎంతజపమైనా బ్రహ్మహత్యా దోషాన్ని తొలి

గించే కాలపురుష దానం పట్టిన పాప మంతరించేది కాదన్న భయ మందరిని పట్టుకుంది. దానంపట్టే వారుంటె రావలసిందని ప్రభువులు రాజ్యమంతటా దండోరా వేయించారు.

హరిభట్టు యనే బ్రాహ్మణ యువకుడు ఆ దానం నేనుతీసుకుంటానని వచ్చాడు. అతనికి తిండి గడవడం లేదు. తనవారనే వారెవరును లేరు. ఇంత కన్న నాకు వచ్చే యెగ్గేమున్నదని సాహసించి దానం పట్టాడు. నిష్ట దరిద్రుడు నకు బంగారం లంభించిందే కాని ప్రయోజనం లేకపోయింది. అతని రూపం మారిపోయింది. పిచ్చిధోరణిలో వాగుతున్నాడు. మొలమీద బట్టలు లేవు. సాటి బ్రాహ్మణు లాతని త్థితి చూడలేక పోయారు. దానమీయబడిన బంగారము నమ్మి వచ్చిన ధనంతో కొందరు బంధువులాతనిని యాదగిరికి తీసుకొని వచ్చారు.

నృసింహక్షేత్రంలో ప్రవేశించినంతనే హరిభట్టు కాలుమదిరి నిలువు మన్నచోట నిలబడ్డారు. మూడు రోజులాయనను విష్ణుకుండమున స్నానములు చేయించి నరసింహస్వామికి ప్రదక్షిణములు చేయించి, క్షేత్రోపవాస జాగరణలు చేయించి నంతనే నాతండు సకలదోషంబుల నుండి విముక్తి పొంది, ధనధాన్యములు కలిగి విద్యావంతు డయ్యాడు. అంతట యాదగిరి నృసింహస్వామి మహాత్మ్యము నందరూ కొనియాడ సాగారు.

# కాకతీయ గణపతి దేవుడు

కాకతీయ ప్రభువులు ఓరుగల్లు సామ్రాజ్యం పాలించారు. దాని మొదటి పేరు ఏకశిలా నగరం. ఇప్పుడు మనము వరంగలను చున్నాము. కాకతీయ రాజులలో రుద్రదేవుడు గొప్పవారు. కాకతీయ ప్రభువులకును కటకము నేలు రాజులకు వైరము లున్నవి. జలము త్రిగుండ నృపాలు డొకప్పుడు పెద్ద సేనల గూర్చుకొని వచ్చి వరంగలు కోట ముట్టడించారు. రుద్రదేవుడు యుద్ధ ప్రయత్నమునసే లేనందున తగినన్ని యవకాశములు చాలక రణరంగంలో చనిపోయాడు.

మహారాణి గర్భవతియై యున్నది. మహారాజు మరణించి నంతనే శత్రురాజులు కోటలో ప్రవేశించి రాణిగారిని హింసబెట్టుదురను భయంబున పురోహితులైన మాధవశర్మగారు రాణికి బ్రాహ్మణవేషము వేయించి "యీమె నాకుమార్తె" యని చెప్పి తప్పించుకొని పోయి హనుమకొండలో తనయింట నుంచుకొని జాగ్రతగ పోషించుచున్నారు.

తరువాత పరరాజులు ఓర్గల్లు కోటలో ప్రవేశించి యెంత గాలించి చూచినా మహారాణి కనపడలేదు. అప్పుడు వారనుమానించి సరాసరి హనుమకొండకు పోయి "మాధవశర్మగారూ! మీరు మీకుమార్తె యని చెప్పిన యామెయె వరంగలు రాణిగారని మాకనుమాన మగుచున్నది. మీరు సద్బ్రా

హ్మణులు. బ్రాహ్మణులు కానివారు మహారాజులైనను వారిచేతి నీరు మీరు త్రాగరు గదా! మేము చూచుచుండగ మీరామె చేతి మంచినీరు త్రాగెదరా!" యని ప్రశ్నించారు. శర్మగారంతట తనలో తాను యోచించుకొని నేను నన్ను సమాదరించిన రాజకుటుంబానికి మేలు సేయు చుంటిని గాన రాణిచేతి నీరు ద్రాగిన నేమి! ఒక గర్భవతిని—ఒక పుట్టబోవు శిశువును కాపాడుట కన్న పూర్వాచార మెక్కువైనదికా"దను కొని వెంటనే "అమ్మాయీ! మంచి తీర్థము తెచ్చి యివ్వమ్మా!" అన్నారు.

మహారాణి చెంబునిండా మంచినీరు తెచ్చియిచ్చింది.

మాధవశర్మ జన పాత్ర నందుకొని గటగట ద్రాగాడు.

అది చూచిన ధాన్యకటకం ప్రభువులు మాధవశర్మ గారి మాటలు నిజములే నని నమ్మి! మహారాణి యేమైనదో తెలియదు కాని యీామె మాత్రము బ్రాహ్మణస్త్రీయే"నని తిరిగి పోయారు. రాణికి ప్రాణగండం గడిచింది. శర్మగారికి చేతులెత్తి "అయ్యా! మీరు నన్ను కన్న తండ్రిలా కాపాడారు. నేను మీకు ఋణపడ్డా" నన్నది. శాస్త్రిగారుయు "నీవు నాబిడ్డవే నమ్మా!" అన్నారు.

కొద్ది రోజులలో మహారాణి ప్రసవించింది. మగబిడ్డ కలిగాడు.

శర్మగారా బాలునికి గణపతిరుద్రదేవులని నామకరణం చేశారు. జాతకం వ్రాసి "అమ్మాయీ! నీకుమారుడు చక్రవర్తి కాగలడమ్మా! నీకుమంచి రోజులు వస్తాయి" అని అనగ ఆమె తృప్తిపడుతూ "అంతా మీ చలువయే నాన్నగారూ!" అన్నది.

గణపతి రుద్రుడు ఐదేండ్ల వాడయ్యాడు.

మాధవశర్మ రాజకుమారుని మనుమనిలాగా చూస్తున్నాడు. బాలునికి అక్షరాభ్యాసం చేశాడు. వారు నెలకొల్పిన పద్మాక్షీ పీఠమున్న భవనమునే పాఠశాలగా నియమించి చదువు చెప్పుతున్నాడు. గణపతిరుద్రుడను శర్మగారిని తాతగారనియే యనుకొనుచు భయభక్తులు కలిగి చదువు కుంటున్నాడు. ఆతడొకనాడు పాఠ్యపుస్తకం పొరపాటున పద్మాక్షీ పీఠము మీద పెట్టి మరచిపోయి యింటికి వచ్చాడు. రాత్రి ప్రొద్దుపోయిన తరువాత వాని కామాట జ్ఞాపకమొచ్చింది. వేకువజామున పాఠం చదివి ఉదయం తాతగారి ముందొప్ప చెప్పాలి. పొరపాటు జరిగినట్లు తెలిసితే తాతగారేమంటారో నని శంకించాడు. ప్రకృతి మీద చీకటావరించి యుంది. "ఐతేనేం! నాగుర్తుల ప్రకారం నేను నాపుస్తకం పట్టుక రాలేక పోవుదునా" అని ధైర్యం చేసి యెవరికిని చెప్పకయె తాళంబీగాలు తీసుకొని పోయి పీఠం తలుపులు తెరచి చేతితో తడుము కొంటూ పీఠందాకా పోయి పుస్తకం వెతుకుతూ దేవి పాదాల మీద చేతులు పెట్టాడు.

కటికిచీకటి నిండిన మందిరంలో పట్టపగలులా వెలుగు వచ్చింది. పద్మాక్షీ ప్రత్యక్షమై "ఓయీ! బాలకా! నీవు నాభక్తుడవు. నీవు వేదాచలం మీద నున్న నరసింహమూర్తి నారాధింపుము. శీఘ్రకాలములో నీ యరిష్టములు తొలగి చక్రవర్తి వయ్యేదవు. ఇది నేను నీకిచ్చుచున్న వర" మని చెప్పి యదృశ్యమయింది. గణపతి రుద్రుడు యింటికి వచ్చి తల్లితో

చెప్పాడు. మహారాణి కుమారుని బుజ్జగించి "ఔను నాయనా! నీవొక మహా రాజు కుమారుడ" వంటూ జరిగిన కథనంతా చెప్పింది.

మాధవశర్మ గణపతిరుద్రుని మహారాణిని వెంటబెట్టుకొని వేదగిరికి పోయాడు. అక్కడ మువ్వురూ కృష్ణానది తీరంలో స్నానాలు చేశారు. వేద గిరి నరసింహస్వామికి మహాన్యాస పూర్వకంగా పూజలు చేయించారు. ఆ క్షేత్రంలో నిద్రలు చేసి యింటికి రాగా రుద్రభూపతుల వారి యందభిమానము గల సరదారులంతా వచ్చి గణపతిరుద్రుని కండదండలయ్యారు. గణపతి రుద్రుడు తిరిగి శత్రువులను జయించి ఓరుగల్లుకు ప్రభువయ్యాడు.

తాతగారైన మాధవశర్మ గారిని దైవములా పూజించాడు.

## మంత్రి యుగంధరుని మంచితనము

గణపతి రుద్రమహీపతుల వారి తరువాత రాణిరుద్రమ్మ రాజ్యపాలన చేసింది. ఆమె యనంతరం ముమ్మడమ్మ కుమారుడు ప్రతాపరుద్రదేవులు సింహాసన మెక్కారు. ప్రతాపరుద్ర నరపాలుని కొల్వులో విద్యానాథ పండితులాస్థాన కవియై యున్నాడు. యుగంధర మంత్రి ప్రధానామాత్యులై రాజుగారి ఆదరాభిమానాల నందుకున్నాడు. యుగంధరుని తమ్ముడు జనార్ధన మంత్రి. ఇంకా చెకుముకు శాస్త్రిగారు మొదలైన దిగ్దంతులా రాజాస్థానంలో ప్రముఖులు.

ఒకనాడేదో రాజ్యాంగ విషయం చర్చించడానికి ప్రతాపరుద్రుల వారు యుగంధరుని తమయింటికి పిలిపించారు. వారిరువురు మాటాడుకొను చుండగ పనివారు రాజావారిని స్నానానికి పిలిచారు. తలంటు స్నానం చేయ బోతూ తన మెడలోనున్న రత్నహారం దీసి యుగంధరుని మెడలో వేసి నేను స్నానం చేసి వచ్చాక తీసుకుంటాను. అంతవరకు నీ చెంతనుండనీ" యంటూ లోపలకు పోయారు. యుగంధరమంత్రి "ప్రభువులు ధరించే యిటు వంటి మణిహారాలు మనకెందు" కనుకొని దానిని తీసి చిలక కొయ్యకు తగి లించి తనపనిలో తాను నిమగ్న డయ్యాడు.

కొంతసేపటికి మంత్రిగారికి కటుకుకటుకు మనే శబ్దం వినబడింది.

హారం తగిలించిన చిలుకకొయ్య ప్రాణం గలదాని మాదిరే రత్నహా రము నందని యొక్కొక్క పూసను పంటగొరికి తినడం కన్నారా చూచాడు. యుగంధర మంత్రి ఇది శని ప్రభావం. కాలం చాలనందున యీ కొయ్యకు ప్రాణం వచ్చింది. విలువైన రత్నహారాన్నంతా తినివేసింది. ప్రభువులువచ్చి యడిగితే నేనేం చెప్పగలను? చెప్పితే మాత్రము ప్రజలు నామాట నమ్మ దురా! పైగా నన్ను పిచ్చివాడంటారు. హారమపహరించి యీ మాటలు చెప్పు చున్నా"నని పచ్చిమోసగానిగా నన్ను నడివీధిపాలు చేస్తా"రని భయపడి నందున యెవరికినీ చెప్పకుండ యెక్కడకో వెళ్ళిపోయాడు.

ప్రతాపరుద్రుల వారు స్నానానంతరం తిరిగి వచ్చి చూడగ యుగం ధరుడు కనపడలేదు. రత్నహారమూ కనపడలేదు. రాజభటుల నియమించి నగరమంతా వెతికించినా మంత్రిగారి జాడ తెలియలేదు. అప్పటి కప్పుడె

మంత్రి యుగంధరుడు ప్రభువుగారి మణిహార మెత్తుకొని పారిపోయినాడనే వదంతి దేశమంతటా ప్రాకిపోయింది. ప్రధానామాత్యుడు రాజద్రవ్యం దొంగిలించిన నేరస్తుడుగా నిర్ణయింప బడ్డాడు. యుగంధరుడెక్కడున్నాసరె నిర్బంధించుకొని తీసికొని రావలసిందిగా రాజాజ్ఞ ప్రకటింప బడింది.

యుగంధరుడు మారువేషం ధరించి నందున యెవరికీ పట్టుబడలేదు.

దేశద్రిమ్మరియై యూరూరు తిరుగుతూ పోయిన మంత్రి కొన్ని దినాలకు యాదగిరి చేరుకున్నాడు. అకలిబాధతో ప్రాణం ప్రసొక్కిపోయింది. ఇక ముందు కడుగు వేయలేని స్థితిలో పడిపోయాడు. నృసింహస్వామిని దర్శింప బోవుచున్న యాత్రికులు చూచి పాపమెవరో పడిపోయినారని జాలిగొని ప్రక్క నున్న విష్ణుకుండంలోని నీరుతెచ్చి ముఖంమీద చల్లారు. పడిపోయిన బాటసారి కన్నులు దెరచి చూడగ వారాయనకు స్వామి ప్రసాదం యిచ్చారు. దానిని భుజించిన యుగంధరునకు శక్తికలిగి తనకుపకారం చేసిన వారివెంట వెనుకకు తిరిగిపోయాడు.

కాని యుగంధర మంత్రికి తాను నృసింహక్షేత్రంలో సంచరించినట్లుగాని—విష్ణుకుండంలోని నీరు తనముఖం మీద పడినట్లుగాని—తాను నృసింహస్వామి ప్రసాదం పుచ్చుకొన్నట్లుగాని తెలియదు. ఆయన రాజభటులకు భయపడి దూరదూరంగా తొలగిపోతునే యున్నాడు. ఒకనాడాయనను ప్రతాపరుద్రుల వారి సేవకులు పట్టుకొని బంధించుకొనిపోయి రాజుగారి ముందు నిలబెట్టారు. ప్రభువులేమంటారోనని మంత్రి కంపించి పోతున్నాడు.

చక్రవర్తుల వారు యుగంధరునేమీ యనలేదు. కొందరు మంత్రులను సామంతులను—న్యాయవేత్తలను రావించి వారితోబాటు యుగంధరుని గూడ వెంటబెట్టుకొని మునుపు మంత్రిమెడలో వారు హారంవైచిన చోటుకుపోయి చిలకకొయ్యనుచూచి "ఓసీ! ప్రాణములేని ప్రతిమా! రాత్రి నాస్వప్నమున యాదగిరి నరసింహస్వామి కనుపించి హారము నీవేతింటివని—మాఅమాత్యులవారు దానినపహరింప లేదనియు చెప్పారు. యుగంధరుకు తనకు తెలియకుండానే స్వామివారి క్షేత్రములో ప్రవేశించి. తీర్థజలంతాకి, ప్రసాదంపుచ్చుకొనిన పుణ్యం వలనస్వాములవారే నాకలలోవచ్చిచెప్పిరి కనుక యిదబద్ధము కాదు మాహారము మాకిమ్ము. లేదేని నరసింహాకు నిన్నుమన్నిం" పదని హెచ్చరించి నంతనే చిలుకకొయ్యనుండి రత్నహారం బయటపడింది.

దానినందరూ పరిశీలించి చూచి "అదేయిది" అన్నారు.

యుగంధరమంత్రి నిర్దోషి యని ప్రజలంతా తీర్మానించారు.

ప్రతాపరుద్రులవారు యుగంధరుని ఘనంగా సన్మానించారు.

యుగంధరమంత్రి యిదంతా వేదగిరి నృసింహస్వామివారి కృపయని నమస్కరించాడు.

# గాలవ మహాముని కథ

గాలవముని గొప్ప తపస్వి. గర్వము లేనివాడు. పరోపకారి. ఆయ నొకప్పుడు తీర్థయాత్రలు చేయడం జరిగింది. అది గ్రీష్మఋతు వైనందున యెండలు తీవ్రమయ్యాయి. ఎక్కడనో జీవనదులలో—లేక, పెద్ద సరోవర ములలో గాక యెచటను త్రాగుటకు మంచినీరు దొరకనిరోజులు. ప్రయా ణము సేయుటయు కష్టము దూరదేశములనుండి నడిచిన బడలికచే గాలవుడు సొమ్మసిలి పోయాడు. కనురెప్పలు మూతలుపడి పోవుచున్నందున నొక చెట్టుక్రింద పండుకున్నాడు. నేల సమమట్టముగ లేక రాలుండుటం చేత మునికి పడక కుదరలేదు. పైన వడగాలి వీచుచుండుటం చేసి చాలసేపు తపనచెంది చివర్కికెట్లో నిద్ర పోగలిగాడు—అది గాఢనిద్రగా మారింది.

అదే సమయంలో బాటన పోవుచున్న యింకొక బ్రాహ్మణ బాలుడు శయనించి యున్న మునిని చూచి "అయ్యా దాహము కావలయును. నీయొద్ద నున్న యి" మ్మని యడిగాడు. అట్లు నాలుగైదు మారులు పిల్చినను నిద్రించుచున్న వాని నుండి యెటువంటి సమాధానమును లేకపోయినది. దాహపీడితుడైన బాలకుం డిక వీని నడిగియు ప్రయోజనము లేదనుకొని ముందుకు సాగిపోయాడు. కొంచెము దూరములోనే దప్పిక తీరని బాధతో నాతడు పడిచని పోయాడు.

గాలవముని తన ప్రయాస తీరిన పిమ్మట నిద్రలేచాడు. దాహపీడనచే గొంతుక యెండి చనిపోవు తరుణమందైనను బ్రాహ్మణునకు మంచినీరీయని మహాపాపమున వాని కప్పుడప్పుడే పాండువ్యాధి సంక్రమించింది. వికలాంగు డయ్యాడు. చూచిన వారాందరు నసహ్యపడి దూరముగా తొలగి పోవుటయే గాక యొక్కరైనను అయ్యో పాపమని దయదలంచి చేయి పట్టుకొని లేవదీసిన వారైనను లేచి పోయారు. ఆయనప్లే లేని యోపిక దెచ్చుకొని యాత్రశమంబుల వెంట బోయినను వానికిన్ని మంచినీరిచ్చు వారు లేక పోయారు.

ఆయన స్థితి ఆయనకే ఆశ్చర్యం కలిగించింది.

తపసులో నేనే లోపము చేయలేదు. ఋషులలో నాకును గౌరవ ముండెడిది. మరికొంత పుణ్యము కావలయునని తీర్థయాత్రలు చేసి వచ్చాను. ఎన్నెన్నో దివ్యక్షేత్రాలను దర్శించాను. ఎన్నెన్నో పుణ్యనదులలో, తీర్థములలో స్నాతనై దాన ధర్మాలు చేశాను. ఎందరెందరో దేవతామూర్తుల నారాధించాను. నేనెన్నడబద్ధ మాడలేదు-ఏ ప్రాణికి నపకారము సేయలేదు. యితరుల ధనములకు గాని, భార్యలకు గాని, వస్తువాహకములకు గాని భ్రాంతి పడనూ లేదు. నాకీ కర్మ యెట్లు వచ్చింది! ఎట్లు పోతుం"దని పరిపరి తెరంగుల చింతించాడు.

ఒక నాడాయనకు నారదముని యెదురై పలుకరించాడు.

గాలవునకు పోయిన ప్రాణాలు తిరిగి వచ్చి నంతానంద మయింది. తన దీనావస్థ నంతా నారదమునితో చెప్పుకొని వాపోయాడు.

నారదముని తిరిగాయనతో "గాలవా! మంచి పనులే చేశావు కాని ఒక్క పొరపాటు జరిగింది. ఒకనాడు నీవొక చెట్టు క్రింద పరుండి నిద్రించు చుండగ నొక విప్ర కుమారుడు వచ్చి నిన్ను దాహమిమ్మని యడుగాడు. నీవపుడు స్మారకమునందే లేక మాటాడ వైతివి. నిన్నడిగి విసిగి పోయిన ఆ బాలుడు మరికొంచెము ముందుకు పోయి మరణించాడు. ఆ పాపమునిన్ను చుట్టుకొంది. అందువలన నీజీవిత మింత భయంకరంబుగ మారి పోయింది.

ఇప్పటికైనను నీవొక్క పనిచేయుము.

కృష్ణానదీ తీరమున వేదాచల మున్నది. దానిమీద నరసింహస్వామి వేంచేసి యున్నాడు. నీవా దేవదేవు నారాధించితి వేని నీపాపమంతయు పోయి సర్వసుఖంబుల ననుభవించెద" వనినంత గాలవమునియు సంతోషం బున "ఔను సుమా! హిరణ్యకశిపుని సంహరించిన నరసింహమూర్తి భక్త పాలనకై వేంచేసి యున్న యునంత మంతయు నెరుంగుదును. కర్మ పరి పక్వము గాక నాకామాటయే జ్ఞాపకము రాకపోయింది. నీవలన నాకిపుడు దారి దొరికింది. నీయుపకారము నేను మరచిపో" నంటూ నమస్కారం చేసి వెళ్ళి పోయాడు.

యాదగిరి నరసింహస్వామి గాలవ మహామునిని కరుణించాడు.

నారదుడీ గాలవముని కథ లోకమంతటా చాటి చెప్పాడు.

# సత్యవంత మహారాజు కథ

ఒకప్పుడు కళింగ దేశాన్ని సత్యవంతుడనే రాజు పాలించాడు. ఆయన చాల ధర్మాత్ముడు. ప్రజల నాదరాభిమానాలతో చూచేవాడు. ఒకానొక సమయంబున రైతు ప్రజలు వచ్చి "మహారాజా! అడవిలో క్రూర మృగాలు చెలరేగినై. పొలాలలో మేము సంచరించడం ప్రమాదకరంగా వున్నది. పులులు సివంగులు చిరుతలు విచ్చల విడిగా వచ్చి మాపశువులను చంపివేయు చున్నవి. మనుష్యులలోను కొందరు పులివాత బడ్డారు. మేం సేద్యం చేయడానికి గూడా భయపడు చున్నా" మని చెప్పుకున్నారు. సత్యవంత మహారాజు అటులైన నేనిపుడే యడవికి వచ్చి దుష్ట జంతువులను వేటాడి, మీ కెటువంటి కష్టనష్టములు కలుగకుండ చూస్తా"నని వారి కభయ మిచ్చాడు.

సత్యవంతుడు ఆ మరునాడే కొందరు పరివారమును వెంటబెట్టుకొని అడవికి పోయి మృగములను వేటాడి చంపాడు. అప్పటకి యెండ మిక్కుటమయింది. మృగయా వినోదమున రాజు బడలిక చెందాడు. దాహము కావలసి పరిసర ప్రాంతాల తిరుగుతు దారి తప్పి చాలా దూరం పోయాడు. నిజానికిపు డాయన తన గుడారా లున్నచోటు చెప్పలేని స్థితిలో నున్నాడు. అయనకు దాహబాధ శ్రమబెడుతూంది. తనివిదీర మంచినీరు త్రాగితేనే గాని యేదీ యోచించలేడు.

మంచినీటి కొలను కనపడంది. దానిలోని నీరు టెంకాయ పాల వోలే తేటగానున్నవి. కొలను చుట్టు పూలచెట్లు దట్టంగా పెలిగినై. సమీపంలోని పొదరింట్లమీది చల్లని గాలి రాజుగారి తాపాన్ని కొంత ఉపశమింప జేసింది. ఆయనగారి మనసుకు హాయి దోచింది కూడను.

రాజుగారు కొలనులో మంచినీరు త్రావుచుండ నక్కడకు వచ్చిన యువతి "ఎవరవు నీవు? నా యనుమతి లేకుండ యిందులో నీరు త్రాగే యధి కారం నీకెవరిచ్చారు?" అని గద్దించింది. సత్యవంతుడు తలెత్తి చూచాడు. ఆ వచ్చిన దొక అడవిజాతి పిల్ల. పదహారేండ్ల పడుచుదనం. ఆ సుందరిని చూడగనే రాజు మోహ పరవశుడై సర్వం మరచి పోయాడు. మెల్లగా సమీ పించి "సుందరీ! నీవెవరవు? నేను కళింగదేశం పాలించే సత్యవంతుడనను వాడను. ఇందలి మంచినీరు త్రాగుటకు నేనే యనుమతి పొందవలయు నను చుంటివి" అని పలురించాడు.

ఆమె ఒయ్యారాల లొలికించుతూ "నేనీ పేటకు యజమాని యైన కోయజాతిరాజు కూతురును. మా గూడెం దగ్గరలోనే వుంది. ఈ కొలను నాది. అందుకని నేనలాగన్నా" నన్నది.

సత్యవంతుడింకా మురిసిపోయాడు. "సరే తెలియక నీకొలనులో నీరు త్రాగాను–తెలిసి నీపెదవితేనె త్రాగుతాను. నీకిష్టమేనా! అన్నాడు.

బోయపిల్లవానితో "మాయయ్యకు చెప్పి నన్ను పెండ్లాడు" మంటూ చివాలున పూపొదల చాటుకు పోయింది. ప్రేమపిచ్చిలో బడిన మహారాజా ప్రాంతమంతా వెతికాడు. ఆమె అక్కడనే యుండి ఆయనకు తెలియకుండ

దాగుచున్నందున సుందరి కనపడలేదు. ఆమె నాలింగనం పొందకుండ తిరిగి పోనంగీకరించని రాజు విచారగ్రస్తుడై కొలను యొడ్డున కూర్చున్నాడు. అదంతా గమనించుచునేయున్నయా బోయపడుచు వానిని సమీపించి నవ్వుతూ "యింకా యిక్కడనే కూర్చుని యున్నావేం! మాయయ్య నడిగావా!" అన్నది.

ఆమె కొంటె చూపుల కాయన కింకా ముగ్ధుడయ్యాడు. లేచి "సుందరీ! మీ నాన్నతో మాటాడు నిదిసమయంకాదు. ఆతడేదేని ఆంక్షబెట్టవచ్చును అపుడు మన కోరికలు ఫలింపవు. యిందునీవు నాదావుగా. తరువాత విషయ మాలోచించుకుందాం" అన్నాడు. ఆమాటలామెకు గూడ మంచివిగానే తోచినై. బోయపడుచు తలవంచింది. సత్యవంతుడు డామెతో కామసుఖమను భవించాడు. ఆమెను విడిచి రాజధానికి పోలేని సత్యవంతుడు రాజ్యాన్నికూడా మరచిపోయి కొంతకాలమక్కడనే సుందరితో కాలంగడుపు కొంటున్నాడు.

ఒకనాడు సత్యవంతుడు సుందరితో సరసాలాడుచుండగా కోయరాజు వచ్చి సత్యవంతునితో వైరం బెట్టుకొన్నాడు. సరె "రాజా! కన్నెపిల్ల మన సుమార్చి కామవాంఛ దీర్చుకున్నవు కనుకనీవునాబిడ్డనే పెండ్లాడు. నాకభ్యంతరంలే"దన్నాడు. సత్యసంతున కపుడాలోచిన కలిగింది. తానుగొప్పకులము వాడు. ఈయడవిజాతిపిల్లను పెండ్లాడడానికి సంఘమంగీకరింపదు. తనకున్న గౌరవం గూడా తగ్గిపోతుందని భయపడినందున "కోయరాజా! ఈమెను నేను పట్టపురాణిగా స్వీకరించడానికి మాయింటి దగ్గర వారొప్పు కొనరు. నే నీమెనువిడనాడను. ఈమె జీవితమంతా బ్రతకడానికి కావలసినంత ధనమిస్తాను నీకుమాత్రె నిందేయుంచి నేను వస్తూపోతుంటా"నన్నాడు.

డానికి కోయరాజంగీకరించలేదు.

పెండ్లాడడానికి సత్యవంతు డిష్టపడలేదు.

వారిద్దరికి యుద్ధం జరిగింది. బోయరాజు తన మంత్రశక్తితో సత్య వంతుని మూర్ఛిల్లజేసి, కొండలోయలో పారవేయించాడు. సత్యవంతునికి మూడురోజుల వరకు స్మారకములేదు. తరువాత తెప్పరిల్లుకొని లేచాడు. తానున్న చోటు కొండలోయయని గ్రహించాడు. అన్నపానములు లేనందున నీరసించి పోయాడు. మెల్లమెల్లగ కొండలోయనుండి వెలుపలకువచ్చి చెట్లు కాయలుదిని, మంచినీరుదాగి కాస్త పుంజుకున్నాడు.

ప్రేమించిన ప్రియురాలు కనపడలేదు. దానికిపుడు తనమీద మమ కారం లేదనిగూడ గ్రహించాడు. అంతటితో వానికి సంసార సుఖాలమీద విరక్తికలిగింది ఆంజనేయస్వామియే యొక సన్యాసి రూపమున కన్పించి "రాజకుమారా! దప్పికగొని యుంటివి. అదిగో ఆ జలాశయమున నీదాహ బాధ తీర్చుకొనుము. నీవిపుడు లక్ష్మినరసింహస్వామి క్షేత్రమునకు చేరితివి. ధన్యుడవు. విష్ణుకుండమున స్నానమొనరించి స్వామిని సేవింపుము. భక్తి పాలకుడై ఆంజనేయుండును యిందు వేంచేసి యున్నాడు. ఆంజనేయుని ప్రార్థింపుము. నీపరిస్థితియంతయు చక్కబడగలదని హితబోధచేశాడు.

సత్యవంతు డటులనే విష్ణుకుండమున మునిగి, నరసింహస్వామిని సేవించి, ఆంజనేయుని ప్రార్థించి నాటికందే నిద్రించి మరునాడు మేల్కాం చాడు. కళింగదేశము నుండి ప్రభువులను వెదికికొనుచువచ్చిన రాజసేవకులు సత్యవంతునిచూచి మహానందంతో యింటియొద్ద విషయంబులు చెప్పి నగరం

బునకు గొని పోయారు. నాటి నుండి కళింగదేశమున నృసింహస్వా
మహిమ ప్రఖ్యాతి గాంచింది.

ఈకథ వేదచల మాహాత్మ్యమును గురించి పార్వతికి పరమేశ్వరు
చెప్పాడు.

# సుమతీ శీతభానుల దాంపత్యము

కృతయుగంలో శీతభానుడనే బ్రాహ్మణ యువకుడున్నాడు. ఆ
నకు బాల్యము నుండియు మంచి అలవాట్లు పట్టుబడలేదు. జూదరులు, త్రా
బోతులతో స్నేహము సేయువాడు. ఆయనను బాగుచేయ వలయునని త
దండ్రులెన్నియో ప్రయత్నములు చేశారు. కాలం గడచుచున్న కొలది శీ
భానుడు చెడిపోవు చుండెనే కాని వానిలో మార్పు కనపడలేదు. పెండ్లిచేసి
గాని యితనికి కుటుంబ బాధ్యతలు తెలియవని పెద్దలు కొందరు తీరా
నించారు.

శీతభానుడు భ్రష్టపట్టి పోయిన పరమదుర్మార్గుడన్న సంగతి బంధు
లలో తెలియని వారెవరునులేరు తెలిసీ నందలో వానికి పిల్లనిచ్చువారునులే
ఐనప్పటికిని—— కన్నవారి కడుపుతీపి త్రోసివేస్తే తొలగి పోయేది కా
దున వారు కష్టపడి దూరదేశాలలో సంబంధం మాటాడి కుమారునికి పెం

చేశారు. కోడలు కాపురానికి వచ్చింది. ఆమె పేరు సుమతి. సుమతి యన్న పేరామెకు సార్థక నామం.

సుమతి యుత్తమ వంశంలో పుట్టిపెరిగిన బుద్ధిమంతురాలు. బాగుగ చదువు కున్నది కూడను. భారతస్త్రీ ధర్మాలన్నీ యామెలో నిండియున్నవి. ఆమెను గన్నవారు తెలియక మోసపోవుటంజేసి యీదుర్మార్గున కంటగట్టి అన్యాయంగా గొంతుకోశారని ఊరూవాడా అనుకొంటుంది. సుమతి కాపురానికి వచ్చిన క్రొత్తలలో పెనిమిటి నడవడిక నర్థంచేసికొనినపుడైన తనమనసులో యేమను కొన్నదోయేమోకాని, పైకి మాత్రము ఎప్పుడూ యెవరితోనూ యేమాటా నోరుజారిన పాపాన పోలేదు. అంత మహోత్తము రాలిని చూచి అత్తమామలు కూడ బాధపడుచుండేవారు. కొడుకును మందలించేవారు. ఎవరేమనుకున్నా సుమతి పతి సేవ మానిందికాదు.

కొంతకాలానికి అత్తమామలు చనిపోయారు.

పెనిమిటి యింకా విచ్చలవిడిగా సంచరించుచున్నాడు.

ఆమె పల్లెత్తుమాటయినను పతి ననడం లేదు. ఆయన స్వేచ్ఛ కడ్డు చెప్పడం లేదు. శీతభానుడు జూదరియై యింటిలోని వస్తువుల నన్నింటిని పోగొట్టాడు. భార్య దగ్గరున్న బంగారు నగలన్నింటిని ఒలుచుకొనిపోయి అమ్మివేశాడు. ఇల్లు తాకట్టుపెట్టి సొమ్ము చెల్లింపలేక బాకీదారులను కట్టివేశాడు. ఇంటిచుట్టు రుణాలయ్యాయి. ఊరంతా అప్పులయ్యాయి. అతడింక గ్రామంలో నుండ వీలులేక భార్యతో గూడ చెప్పకుండ దేశాలు పట్టుకపోయాడు.

కన్నతండ్రి వచ్చిచూచి కంటతడి బెట్టుకున్నాడు. "అమ్మా! నీవు సుఖపడతా వనుకున్నాను గాని యిలా జరుగుతుందనుకొనలేదు. పోనీ ఆయ నెలాగూ నిన్ను విడిచిపెట్టి దేశాల పాలయ్యాడు గదా! నీకిక్కడ నా యనే వారెవరూలేరు. మనయింటికి పోదాంరా. నీజీవితానికి లోటులేకుండా నేను చూచుకుంటా" నన్నాడు. కాని సుమతి దానికంగీకరింపక "అదేమిటి నాన్న గారూ! మీయల్లుడు గారెక్కడున్నారో వెదికికొంటూపోయి వారి సేవసేయ దగిన దాననే కాని పుట్టింటబడియుండి పొట్టపోసికొన దగిన దాననా! నా యదృష్టానికి మీరెం చేయగలరు? మీరు వెళ్ళండి" అన్నది.

ఆమాట కందరూ మెచ్చుకున్నారు.

తండ్రి మరల నామెతో "నీయిష్టాన్ని నేను కాదనను. ఎంతడబ్బు ఖర్చుపెట్టయినా నీపెనిమిటి యున్నచోటు విచారించి నిన్నునేనే తీసుకొని పోయి ఆయన దగ్గర విడిచిపెట్టి వస్తాను. అందాకా నాదగ్గర నుందువుగాని ర"మ్మన్నాడు. శీతభానునికి సంబంధించిన వారుకూడా యీమాట బాగున్నది. మీనాన్నగారు చెప్పినట్టుచేయుమని బలపరచారు. సుమతి తండ్రివెంట పుట్టింటికి పోయింది. ఆమె అన్నలు కన్నపడి తొందరలోనే బావగారున్న చోటు తెలుసుకున్నారు. సుమతి వెంటనే తండ్రిని వెంటబెట్టుకొని భర్తచెంతకు పోయింది.

సుమతిని చూడడంతోనే శీతభానుడు అగ్గిమీద గుగ్గిలమయ్యాడు.

ఆయనేమన్నా యెదిరించని సుమతి పాదాలంటి "ఏమండీ! మీరెందుకిలా వచ్చారు. నాతోచెప్పియుంటె నేను గూడ మీవెంట రాకపోవుదునా! నా

యదృష్టం కొలది మిమ్ము కలుసుకోగలిగాను. నాకంతేచాలు. మనమీ సత్రం లోనే వుందాం. మనం బ్రాహ్మణులం గదా! మధూకరమెత్తుకొనుట మనకు రోషం కాదు. నగరంలో బ్రాహ్మణ కుటుంబాలున్నాయి. నేనేమిమ్ము పోషించుకుంటా" నని దీనంగాపలికింది. ఆయన సరేనన్నాడు.

శీతభానున కింతకు ముందే కొన్ని చిలిపిజబ్బు లంటుకొనినై. అవి యిప్పుడు ప్రబలమై కుష్ఠువ్యాధిగ పరిణమించింది. శరీరమంతా పుండ్లుపడిపోయినై. పుచినీరు కారుచున్నది. దుర్గంధము వచ్చుచున్నను సుమతి చీదరించుకొనలేదు. గ్రామంలో మధూరమెత్తుకొని వచ్చి భర్తకు పెట్టి ఆయనగారు తినగా మిగిలినదానినే తానుతింటూ, పతిసేవచేస్తూ, ఆయనని కాచుకొని యుండడం చూచిన వారాంతా సుమతిని మెచ్చుకున్నారు. ఆగ్రామ కరణంగారు సత్రం ప్రక్కగా నొకపాకవంటి యింటినేర్పరచి దానిలో నీబ్రాహ్మణ దంపతులుండుట కేర్పాటులు చేశారు.

# మహా పతివ్రతా ప్రభావము

ఆగ్రామానికి మైలుదూరంలో రాజనగరముంది. ఊరికంతా పేరు చెంగిన వేశ్య చింతామణి. చింతామణి పూర్తిగా ముస్తాబు చేసుకొని వీరింటిముందుగా పోవడం చూచాడు శీతభానుడు. వానికామెమీదనురాగం కలిగింది. వెం

టనే భార్యను పిలిచి "నాకా చింతామణి పొందు కావాలి. నీవే తగిన అవకాశం కలిగించ" మన్నాడు. ఆమాట వినిన సుమతి మాటాడలేక పోయింది. "ఏమండీ! చింతామణి సానిగద! ఆమెకు ధనం కావాలి. మనం పొట్టతిండికి లేనివారం. అదిగాక మీశరీరమిపుడిలాగా కుష్ఠరోగంతో పాడయి పోయింది. మీయాలింగన మెవ రంగీకరి"స్తారు. ఇదినెరవేరే కోరికకాదు. దయయుంచి, మీమనసు మార్చుకొనండి" అని బ్రతిమిలాడింది.

శీతభానుడా మాటల వినిపించుకొనక సుమతిని తిట్టాడు—కొట్టాడు—చివరకు అన్నంతినకుండ మానేశాడు. ఆమె నాశక్తివంచన లేని ప్రయత్నం చేస్తానని చెప్పింది. చింతామణి యుండేయిల్లు తెలిసికొనిపోయి ఆమె కాళ్ళవేళ్ళబడి బ్రతిమిలాడుకొని తాను వచ్చిన పని చెప్పింది. చింతామణి సానియైనా సుమతీదేవి పతిభక్తికి మెచ్చుకొని "అటులైన నేటిరేయి నీ మగనిని నాయింటికి తీసికొనిర"మ్మని చెప్పింది. సుమతికి వెయ్యేనుగుల బలం వచ్చినట్లనిపించి యింటికివచ్చి "మీపని యనుకూలమైన"దని భర్తకు చెప్పింది.

చీకటి పడగనే సుమతి తన పెనిమిటిని స్నానం చేయించి, భోజనం పెట్టి. ఒక గంపలో కూర్చుండ బెట్టుకొని. ఆ గంప తన తలమీద నుంచుకొని చింతామణి యింటికా చీకటిలో బయలుదేరిపోతూ దారిలోని యడవిలో నడుస్తూండగ పొరపాటున శీతభానుని కాలొక మునికి తగిలింది. ఆ ముని కోపించి "ఎవడవురా! నన్ను కాలదన్నిన నీవు సూర్యోదయం బగుచుండగ మరణించెదవులె" మ్మని శపించాడు.

ఆమాటలాలకించిన శీతభానునకు మర్నభీతి కలిదింది.

సుమతి అచటి నుండి మే తిరిగి వెనుకకు వచ్చి తన యింట పెనిమిటిని మంచముమీద పరుండబెట్టిన తరువాత "సూర్యోదయం బగుచుండగ గదా మావారు చనిపోవునని యామునిశ పించినది! సూర్యోదయమే కాకపోవుగాక" యన్నది.

రాజుగారి భవనంలో రత్నాభరణం దొంగిలించుకొని పోవుచున్న చోరులను రాజవాటులు వెంబడించారు. దొంగల కింక దారిదొరకక పరుగెత్తి పోవుచుండ నొక మున్యాశ్రమం కనపడింది. వారారత్నహారం నా మున్యాశ్రమంలో పడవైచి పారిపోయారు. ఆ యాశ్రమం మాండవ్య మహామునిది. రాజభటులు వచ్చి మునినే నేరస్తుడుగా భావించి హారంతో గూడ గొనిపోయి రాజుగారి కొప్పగించారు. మాండవ్య ముని దొంగిలించె ననుట కెవరు నంగీకరింప లేదు కాని, వస్తు వారి దగ్గర దొరికినందున శిక్షవేయక తప్పలేదు. మాండవ్యుండును న్యాయాకారిగా రాజిచ్చిన దండన ననుభవింపక తప్పనిదైనది. చెట్టుకొమ్మకు కట్టబడి వ్రేలాడుచు బాధ ననుభవింపుచున్నందున వానికి నెవరిపాపమో తగులటం జూసి ముని శపించారు.

సూర్యోదయ మెంత సేపటికి కాలేదు. ప్రపంచమంతా చీకటిలోనే మునిగియుంది. మునులు. దేవతలంతా దివ్యదృష్టితో సుమతీదేవి యిచ్చిన శాపం తెలుసుకున్నారు. వారంతా కలిసి, అత్రిమునీంద్రుని భార్యయైన అనసూయా దేవి చెంతకు పోయి విషయమంతా వివరించి "అమ్మా! మహాపతివ్రతవైన నీవే దీని కుపాయం చూడాల"నని ప్రాధేయ పడ్డారు. అనసూయా

దే వారందరిని వెంటబెట్టుకొని శీతభానుని యింటుకి వచ్చి "అమ్మా! సుమతీ దేవీ! నా పాతివ్రత్య ప్రభావంతో నేను నీభర్తను బ్రతికించెదను. నీవు సూర్యోదయం బగునట్లనుగ్రహింపు" మని కోరింది.

సుమతి తన శాపమునుప హరించుకుంది.

సూర్యోదయంబై లోకములకు వెలుగొచ్చింది.

శీతభానుండు మరణించాడు.

అనసూయాదేవి చనిపోయిన శీతభానుని తిరిగి బ్రతికించింది.

అపుడా దేవమునీంద్రులు—అనసూయాదేవియు "సుమతీ! నీ పెనిమి వేదగిరి క్షేత్రమునకు దీసికొని పోయి కృష్ణానదీ తీరమున స్నానము చేయింపుము. లక్ష్మీ నరసింహస్వామి చుట్టు ప్రదక్షిణము సేయింపుము. విష్ణుకుండమును దర్శించి యందున్న ఆంజనేయ స్వామికాకు పూజచేయింపు" మనగ నాసాధ్వి యాదగిరికి పోయి విధివిధానంబుగ నృసింహుని పూజించినది. ఆ మరునాడే శీతభానుని కుష్టువ్యాధి యంతయు మాయమై సుందరరూపము వచ్చింది. శీతభానులు రతీమన్మధులట్లు సుందరాంగు లయ్యారు.

నృసింహస్వామిని దర్శింప వచ్చిన యాత్రికులలో కొందరు శ్రీమంతు లీ బ్రాహ్మణ దంపతులను చూచి మనసు కలిగి సువర్ణదానము చేశారు. శీతభానుండు జ్ఞానియై స్వామియెదుట "సుమతీ! నేనింక మీద నెట్టి వ్యసనాలకు లోబడక నీయందనురాగము గలిగి సదాచారమున నడచుకుంటా" నని ప్రమాణం చేశాడు. అంతటనుండి ఆదంపతు లానందంగ జీవించారు.

# కదిరి నరసింహ దేవాలయము

రాయలసీమకు చెందిన అనంతపురం జిల్లాలో కదిరి లక్ష్మీనరసింహ స్వామి వేంచేసియున్నాడు. కదిరి తాలూకా గ్రామం ధర్మవరం నుండి పాకాల పోవు రైలుమార్గాన ధర్మవరానికి నలుబదిరెండు మైళ్ళ దూరానను న్నది. యాదగిరి, సింహాచలం, అహోబలం, మంగళగిరి మొదలగు నృసింహక్షేత్రముల స్థాయికి తీసిపోని యొక ప్రముఖ యాత్రాస్థలం. తిరుపతి స్థల ప్రభావం గల మహాపుణ్యస్థల మనియు కొనియాడ బడినది.

"ఈకదిరి లక్ష్మీనరసింహాలయ యెపుడవతరించింది?—ఎవరు నిర్మింనరు?" అనే ప్రశ్నలకు సరియైన సమాధానం దొరుకుటలేదు. ఐనను యిచటి శిలాశాసనము లాధారము చేసికొని కొంత వరకు చరిత్ర సేకరించుచున్నారు బ్రహ్మాండ పురాణంలో "కదిరి స్థలపురాణ"మను పేరున నీస్వామి ప్రభావాదులను గురించి పదమూడాశ్యాసములలో యేనువందల అరువదేడు శ్లోకాల రూపాన వర్ణింపబడినవని చెప్పుచున్నారు.

ఖ=అద్రి—ఖద్రి యీక్షేత్రము యొక్క మొదటి పేరు. పాపులను పావనులుగ జేసిముక్తి నొసంగుటకే లక్ష్మీనరసింహస్వామి పాదమొక కొండ వంటి దనుభావంబున ప్రథమములో యీక్షేత్రమునకే నామకరణం చేసి యుండురని పండితులు తెలియచేయుచున్నారు. కాలక్రమేపి జనవాడుకయందు ఖద్రి కదిరిగ రూపాంతర మొందె ననుటయు సమంజసము. కదిరి నగరం

సుందరముగ నున్న వ్యాపార కేంద్రము. స్వాములవారి రథము నిలుపబడిన మార్గము తేరువీథియని చెప్పబడుచున్నది. పట్టణంబునందదియొక కూడలి కూడను.

ఆలయ విస్తీర్ణము కొన్ని యకరాల పరిధి నాక్రమించింది.

ఇచట వేంచేసియున్న నరసింహస్వామియే స్వయముగ ప్రతిదినము పూజించు కొనుటకుగాను వారి యుత్సవ విగ్రహములను భృగుమహర్షికి యిచ్చి నట్లొక వదంతి వినబడుచున్నందున యీ యాలయము కలియుగమునకు పూర్వమే రూపొంది యుండవచ్చుననుట కవకాశం లభించుచున్నది. బ్రహ్మాండ పురాణమున వర్ణింపబడి యుండుటను బట్టియు కదిరి నరసింహాలయం యుగములనాటిదని రుజువగుచున్నది.

దేవాలయము నందున్న ఒక శిలా శాసనము బట్టి స్వర్ణయుగమని ప్రశస్తిగాంచిన హంపి విజయనగర రాజుల పాలనా కాలంబున నీ దేవాలయము మహోన్నతస్థాయి యందున్నట్లు దెలియుచున్నది. కల్యాణ మండపము నందున్న శాసన మాధారంగా శాలివాహన శకం 1974 వ సంవత్సరంలో విజయనగరాధీశ్వరు లైన బుక్కరాయ భూపాలు పిందలి మండపము నిర్మింప ప్రారంభించి యొక వత్సరమునకే 1975 నాటికి పూర్తిగావించి నజ్లా హింప నగుచున్నది.

రెండవ శాసనం క్రీస్తుశకం 1383వ సంవత్సరమున పట్నం ప్రభువు గోపన్నస్వామియనువారు యీస్వామికి ఆభరణబుల సమర్పించి నట్లును— మూడవ శాసనం క్రీస్తుశకం 1336 వ సంవత్సరమున కొక్కంటి జమీందా

రులు పడమర వైపు ప్రాకారంమీది గాలిగోపురము నిర్మించినట్లును— నాల్గవ శాసనం క్రీస్తుశకం 1384 ప్రాంతమున చిన్నమ్మ యనేభక్తురాలు ఉత్తరపువైపు ప్రాకారం మీద గాలిగోపురము గట్టించి నట్లును తెలుపు చున్నవి.

ఆలయమునకు సింహద్వారమైన తూర్పు గాలిగోపురానికి ముందున్న శాసనం విజయనగర ప్రభువు హరిహరరాయలవారు పెనుగొండ నుండి చంద్రగిరికి పోవు సందర్భమున నొకశాసనము చేసినట్లును. ఆశాసనము ప్రతిసంవత్సర మీయాలయంబున జరుగుచున్న బ్రహ్మోత్సవ వములలో చివర దినమైన ఒకరోజున పంచము లీయాలయంబున నిరాటంకముగ ప్రవేశించి స్వాములవారిని దర్శించి సేవించుట కధికారము కల్పించి”రనియు తెలుపు చున్నది.

మరియొక శాసనం శాలివాహన శకం 1451వ సంవత్సరమున తాడిపత్రి జమీందారులు ప్రాకారము నంటికొనియున్న వాహనశాల నిర్మించినట్లును—వేరొక శాసనం క్రీస్తుశకం 1578వ సంవత్సరమున పట్నం కోదండరాం జమీందారులు స్వామి గారికొక శ్రోత్రియ గ్రామము దానమిచ్చినట్లును తెలుపుచున్నవి. కాని యిటీవల వచ్చిన “ఎస్టేట్ ఎబాలిషన్ యాక్ట్” అనగ సంస్థానముల రద్దుచట్టం క్రింద మన ప్రభుత్వం “కొండమాన్యుని పాలెం” అనబడునా గ్రామమును దేవాలయము వారినుండి తిరిగి తీసికొనినందున దేవాలయాధీనమున లేదని చెప్పు చున్నది.

బుక్కరాయలు ఆంధ్ర కర్నాటక రాజ్యములను పాలించినట్లును— బహామనీ సుల్తానులతో రెండు పర్యాయములు యుద్ధములు చేసి కంచి మధురా నగరంబులను కైవసం చేసి కొన్నట్లును—హరిహర రాయలు తమ ప్రజల కెటువంటి లోపమును కలుగనీయకుండగ శాంతి భద్రతలతో రాజ్యపాలనం బొనరించిన కారణంబున "మహారాజాధిరాజు" బిరుదంబు నొంది నట్లును గూడ ఆంధ్ర ధర్మాద్ కాంచి చెంగల్పట్టు తిరునాపల్లి మొదలైన చోట్ల కన్పట్టుచున్నవి.

# ఆచార్య పురుషులు

ఆలయ మందలి మూలవిరాట్టు నరసింహస్వామి హిరణ్యకశిపుని తన తొడలమీద పరుండ బెట్టుకొని వధించుచున్న దృశ్యమున గర్భాలయమందు దర్శన మిచ్చుచున్నాడు.

పూర్వము నందీ సన్నిధిలో పూజారులు ధర్మకర్తలుగ నున్నవారినే ఆచార్యపురుషు లంటున్నారు. కదిరి దేవస్థానమునకు ముందు భాగమున నీ ఆచార్యపురుష వంశీయుల కుటుంబము లున్నవి. వీరు వైశానసాగము శాఖీయ శ్రీ వైష్ణవ బ్రాహ్మణులు. తిరుమల గృహనామం గలవారు. వారు మైసూరు రాష్ట్రమందలి పరకాలనుండి తెచ్చిన రామానుజాచార్యుల నా

విగ్రహమును యిచటి అమ్మవారలయ మందిరంలో ప్రతిష్ఠ చేయబడింది— యాత్రికులకు దర్శన యోగ్యముగా నున్నది.

ఆచార్య పురుషులే నేటికిని యిచటి పూజారులై యున్నారు.

ఆలయ సింహద్వారమునకు ముందు ఎత్తయిన రాతి స్తంభములు రెండు నిలువబడి యున్నవి. పూర్వకాలము నందా రెండు స్తంభములమీద నొకదూల మడ్డముగ నమరించి దానిమీద వరుసగ దీపముల వెలిగించెడి వారట. ఆ స్తంభముల యెత్తు దాదాపు సింహద్వారమునకు సమముగా నున్నది. వాని శిఖరము లందుంచబడిన కొన్ని భాగము లిటీవల వీచిన తుఫానులకు పడిపోవటం జేసి యిపుడా దీపారాధనల కార్యక్రమ మముల లో లేకపోయింది. వానిమీదనే వైష్ణవ సాంప్రదాయంబు ననుసరించిన శంఖ చక్రములు, ఆంజనేయ విగ్రహములే గాక శాసనములు గూడ చెక్కబడి నవి. ఇవియు ఆచార్య పురుషుల నిర్మాణములనియే చెప్పుచున్నారు.

ఈ రాతి స్తంభముల కావలగా మరిరెండు రాతి దూలములు నిలువుగా లల్పబడినవి. వానిని తోరణ మండప మన్నారు. దాని కావలగ వసంత మండప మున్నది. బహుశా యీ వసంత మండపంలో వుత్సవములు జరిపే సమయము లందీ రాతి స్తంభములకు పచ్చాకు తోరణములు గట్టు టాచార మై యుండవచ్చును—ఆలయముఖ ద్వారము యొక్క దక్షిణపు గోడమీదను వరాహము మొదలైన శిల్పములు చెక్కబడినవి. సింహద్వారము మీది గాలి

గోపురము మిగుల యెత్తయినది. బొమ్మకట్టు పనితనంతో నిండి జనాకర్షణ నొందుచున్నది.

# లక్ష్మీ నరసింహాలయములు

సువిశాలమైన యీ ప్రాకారం లోపలి ఆవరణము నందే నృసింహ స్వాముల వారికి, లక్ష్మీదేవి అమ్మవారికి గూడా గర్భాలయములు, వాని మీద విమానములు, ముందు మందిరములు, మండపములు, ద్వారపాలకులు ధ్వజ స్తంభములు వేరువేరుగ వెలసియున్నవి కాని రెండాలయంబులు కలిసి లేవు. రెండు దేవాలయములు నడుమ రమారమి ఐదారు గజముల దారియు కలదు. జనులు అమ్మవారికి, అయ్యవారికి మధ్యనుండి అటుయిటు దిరుగుట కవకాశ మున్నది. కాని యిటీవల దేవాలయ పాలనాధికారులు రెండాలయంబుల నొక టిగా కలిపి యీదారిని మూసివేశారు.

స్వామివారి మూల విగ్రహం వేంచేసి యున్న గర్భాలయము నంటి యొకమందిరము—ఆ మందిరము నంటుకొనియె యింకొక పెద్దమందిరము లున్నవి. ఇవి స్తంభములు మాత్రమే గలిగి చుట్టు బహిరంగముగ లేనందున

వానిని మండపమనుట కన్న మందిర మనవచ్చును. ఈ మందిరములలోని స్తంభముల మీదను మనోహరమైన శిల్పకళ మహోన్నతమై రాణించుచున్నది. పెద్దమందిరము నంటుకొని రాతి స్తంభములు గల విశాలమైన మండపమే బుక్కరాయల వారి నిర్మాణము. దీనిని రంగమర మనియు నందురు. గర్భాలయము మొదలీ నాలుగు భాగములు కలిసియే యున్నవి. మండపం పెద్ద మందిరంబున గలియు చోటు నందొక ముఖద్వార మున్నది. ఈ ద్వారమునకు రెండు ప్రక్కలందును రమారమి మూడు గజములకు మించిన యెత్తుగల ద్వారపాలకులు నిలిచియున్నారు. మిగుల గంభీరముగ నున్న యీ శిల్పములే జయవిజయులు.

రంగమర మనబడు యీ మందిరం తూర్పు చివరలో స్వాముల వారి కభిముఖంగ నున్న చిన్నగుడిలో గరుడాల వారు నిలిచియున్నారు. ఇచటకు అలంకారములు జరుగుచున్నవి. గరుడాల వారికి వెనుకగ మండపం తరువాత యిత్తడి తొడుపుగల ధ్వజ స్తంభమున్నది. దాని తరువాత నింకొకరాతి ధ్వజ స్తంభమున్నది. తరువాత కొంచెం దూరంలో ఆలయ ప్రముఖసింహద్వారము—

మూల విగ్రహానికి కుడిప్రక్కగ నున్న యింకొక చిన్నాలయంలో గోదాదేవి వేంచేసి యున్నది. ఆమె నచటివారు చిన్నమ్మ యనుచున్నారు. చిన్నమ్మ యనగ లక్ష్మియని వారి భావం. యీయమ్మ వారికినీ నిత్య నైవేద్యాది వైభవములు యధావిధిగ జరుగుచున్నవి.

స్వాములవారి దేవళంబునకు ఉత్తరముగ నున్న ఆలయంలో లక్ష్మీ దేవి వేంచేసియున్నది. ఆమెకును విమాన మందిర మండపాలు ఉన్నవి. గర్భాలయము ముందున్న మందిరంలో ఉత్తరంగా స్వాములవారికి యేకాంత మందిర మున్నది. స్వాములవారు ప్రతిదినము రాత్రులందు యిచటకువచ్చి యీగదియంద మర్చబడియున్న యూయలలోని పరుపుపై శయనించి నిద్రిం చెదరు. మరునాటి యుదయం సుప్రభాతంతో మేల్కొంచిన స్వాములవారు తిరిగి వారి స్థానమునకు వచ్చి కొలువైయుందురు. ఈ మందిరమందు నెల కొల్పబడిన నాలుగు రాతి స్తంభాలమీద చెక్కబడిన జిలుగు నగిషీ శిల్ప మెంతయు శిల్పాచార్యులవారి పనితనముకు చాటుచున్నది.

ఈ మందిరానికి ముందున్న మందిరంలో ఉత్తరపు భాగమున నొక చిన్న గుడియందు నమ్మళ్వార్ విగ్రహమును—ఆ గుడి ప్రక్క నింకొక గుడిలో ఆచార్య పురుషులచే ప్రతిష్ఠ చేయబడిన రామానుజులవారి విగ్రహ మును, ఆగుడి ప్రక్కనున్న చోటునందు పండితాళ్వారుల వారి సన్నిధియు కలవు. అమ్మవారి గర్భాలయమునకు దక్షణముగ వేదాంతదేశికుల సన్నిధి కలదు. ఈయాలయపు ముఖద్వారము నందును రెండుప్రక్కల జయవిజయులు ద్వారపాలకులై నిలిచియున్నారు.

కొద్దిరోజుల క్రితమున యీ రెండు దేవళంబులు కలుపబడినవి. గర్భా లయములకు ముందున్న మందిరములో నుండి వాకిళ్ళు నేర్పరచి ఒకాలయ ములోనుండి యింకొకాలయము లోనికి మార్గమేర్పరచారు. ఆ రాకపోకల

కాటంకము కలుగకుంత రెండు ప్రక్కలందును ఉత్తర దక్షిణములుగ గోడల నిర్మించి వానిపై కప్పుయు వేయించినందున నేటియాత్రికులు రెండాలయం బులు కలిసియున్నటులనే భావింప వీలగుచున్నది.

ప్రాకారం నాలుగువైపు లందు నాలుగు ద్వారములు, నాలుగు గాలి గోపురములున్నవి. వానిలో దక్షణపు గాలిగోపురము యిటీవల పూర్తిగాపడి పోయినదని చెప్పుచున్నారు. పడమర ద్వారం వెనుక కొన్ని కాపురములు సేయు గృహములున్నవి. పూర్వం మచట తోటయుండేడిదట. అక్కడనే భృగుతీర్థమున్నది. కార్తీకశుద్ధ పౌర్ణమీలునాడు భృగుతీర్థంలో తెప్పోత్సవ మంచి వైభవముగా జరుగుచుండెడిదనియు—ఆ ప్రాంతము వర్షములు క్రమ ముగా కురియని ప్రదేశంబగుట తీర్థములో నీరులేని సమయము లందుత్సవ ములు చేయరనియు తెలియుచున్నది.

## ప్రాకార వైభవము

సింహదార్వ్రము నుండి దేవాలయ ఆవరణము నందు ప్రవేశించి నంతనే ఉత్తరపుమూల శ్రీరామాలయ మున్నది. ఆ రామాలయమున కెదు

రుగ దక్షిణపుమూల ప్రాకారమున కీవలగ లోపల భాగము నందే ఆంజనేయ లయమున్నది. దాని నంటుకొని గోవిందరాజు సన్నిధి కలదు. ఆయనకక్కడ క్షేత్రపాలకుడు. ఆ తరువాత వటవృక్షం అరుగులున్నవి. వాని కింకను వెను కగ ప్రాకారము నంటుకొని పాకశాల యున్నది.

పాకశాలకు—వటవృక్షమునకు నీవలగ యాగశాల నిర్మింపబడినది. ప్రతిసంవత్సర మీక్రతుశాలలో బ్రాహ్మణులు విధివిధానంబుగ ఫాల్గుణ శుద్ధ దశమీలు నుండీ బహోళ దశమీలు వరకు పదునైదు దినములు యజ్ఞములు సేయుదురు. ఆ సమయంబున స్వాములవారికి బ్రహ్మోత్సవములు గూడ జరుగుచున్నవి.

యాగశాలకు కొంచెము పడమరగ కల్యాణమండప మున్నది. ఇది ముప్పదెనిమిది రాతి స్తంభములతో విశాలముగను—సుందరముగ నున్నది. లక్ష్మీదేవీ నరసింహస్వాములవారి కల్యాణము జరిపేటందులకు నీ కల్యాణ మండపము నందొక శిలా వేదిక నెలకొల్పబడినది. ఆ వేదిక రమారమి గజం న్నర పొడవు. గజం వెడల్పు—గజమెత్తున రూపొందినది. ఆ వేదిక యందు నగిషీ పనితనముగల శిల్పమేగాక శాసనము గూడ చెక్కబడింది. వేదికకు పడమరగ నామండపంలోనే యొక మిద్దెకు బీగము వేయబడియున్నది. కల్యాణ సమయంబున స్వాముల వారిక్కడ పదునైదు దినము లుందురట.

ఆవరణంలోని దక్షిణం పడమరలు కలియుచున్న మూల పెద్దజువ్వి చెట్టు—మారేడుచెట్టు, చెట్లక్రింద అరుగులున్నవి. పడమరవైపు ప్రాకారము నంటియున్న గదులలో మహిళాసంఘము వారి కార్యాలయము నడపబడు చున్నది. పడమర ఉత్తరములు కలియుచున్నమూల కొఠాయి మండపంలో వార్షికంగా చైత్ర వైశాఖమాసము లందు మహోత్సవములు జరుగుచున్నవి. అక్కడనే పరస్థల యాత్రిక బ్రాహ్మణ అన్న సత్రమున్నది. అదియు చాల విశాల భవనం. దానిలోనే విశ్రాంతి పొందుటకు, భోజన పదార్థములను దాచుటకు, వంటలు సేయుటకు, వందలకొలది బ్రాహ్మణు లొకేసారి భోజనములు సేయుటకు, తరువాత వారందరును కలిసి పిచ్చాపాటి మాటలాడుకొనుటకు గూడ వసతులు కలిగింప బడినై.

ఉత్తరము తూర్పులు కలియుచున్నమూల వెయ్యిగాళ్ళ మండపమున్నది. అచటనే జయంతి మండపమున్నది. ప్రాకారము నంటియున్న గదులలో దేవాలయమునకు సంబంధించిన పరికరములు. స్వాములవారి వాహనములు మొదలైనవి భద్రపరుప బడినై. ఈచెప్పబడు యీశాన్యము నందె భవనాశనీ పుష్కరిణి యున్నది. ఈపుష్కరిణి మొదటలో చాల విశాలముగ నుండెడిది. అప్పుడీ ప్రాంతము నందలి జనులిందు స్నానములు సేయుట—యీదుటయు కలదు. ప్రస్తుతమున యీ పుష్కరిణి చాలభాగము నేలమట్టము వరకును పూడ్చి సమతలం చేయబడింది. పుష్కరిణి చుట్టును గజమెత్తున ప్రాకారమువంటి గోడ కట్టబడింది. గోడక్రిందుగ పడమరనుండి తూర్పు ముఖంగా పుష్కరిణిలో దిగుటకు మెట్లమర్చబడినై. ఉత్సవముల

కాలములలో వ్రతములు గల వారు పుష్కరిణిలో స్నానములు చేసిన పిదప నిలబడుటకు—దీపారాధనలు సేయుటకు—పూజలు గావించుటకు, అటుయిటు దిరుగుటకు కూడ నీటిమట్టమున కించుక పై భాగమున చుట్టును రాలు పరచిన మార్గములు నిర్మింపబడినై.ఆసమతలములపై నిలువంబడియున్నవారు పుష్కరిణి పైభాగమును చూచినచో దృశ్యములు మనోహరముగ గన్పట్టగలవు. పుష్కరిణి లోనికి ప్రతివారును పోకుండుటకై చుట్టుయినుపతీగెల సమకించి వాకిలి పెట్టబడియున్నది. దానిచుట్టు నొకచిన్న తోటవలె పూలచెట్లు యితర వృక్షములుగూడ పెంచబడినై. ప్రస్తుత మీ పుష్కరిణి యాత్రికులు, భక్తులు స్నానములు సేయుటకు మాత్రమే యుపయోగపడుచున్నది.

దాని కీవలగ నొక పెద్ద రావిచెట్టున్నది. చెట్టుక్రింద పెద్ద అరుగుయు కలదు. ఆయరుగుమీద రావిచెట్టు చుట్టును రమారమి ఏబదరువదిదాక నాగ ప్రతిష్ఠలు సేయబడియున్నవి. చెట్టుమ్రాను నంటుకొని నాగశిలా ప్రతిమల మధ్యగ అశ్వత్థనారాయణస్వామి రెండుగజముల యెత్తున ఉత్తరపు ముఖం కలిగి యాత్రికులకు దర్శన మిచ్చుచున్నాడు.

ఆలయంబున స్వామి ప్రసాదము లమ్మబడుచున్నవి. దేవాలయపాల నాధికారుల వలన క్షేత్రములో జరిగెడి కేశఖండన, ఉపనయ, వివాహాది కార్యములకును—స్వాములవారికి భక్తులు చేయించు నివేదన పూజ మొదలైన వానికి రుసుములు నిర్ణయింపబడిన రసీదులు నిచ్చుచున్నారు. ఇటీవల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు సిద్ది రెడ్డిగారు చేర్పులు మార్పులతో ఆలయము నూతన వికాసములను పొందినట్లు యిచటి ప్రజలవలన తెలియుచున్నది.

నరసింహక్షేత్రములలో కదిరి యొక దివ్యస్థలమై గణన కెక్కింది.

## విశ్వామిత్ర ముని ప్రతిజ్ఞ

కృతయుగంలో స్వర్గలోకమున దేవేంద్రుడొకనాడు సభదీరి కూర్చున్నాడు. అప్పుడా సభలో వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, కపిలుడు, గార్గ్యుడు, మాండవ్యుడు, నారదుడు మొదలైన మునులంతా వారివారి స్థానాల నలంకరించారు. ఉన్నట్టులుండి దేవేంద్రుడు సభలోని వారందరివంక చూచి "అయ్యలారా! మీరు తపోధనులు—జరిగినది, జరుగుచున్నది, జరుగబోవునదియుగూడ తెలిసిన మహానుభావులు. యోగదృష్టితో యెక్కడెక్కడ నున్న విషయంబులను చూడగలవారు కావుననేనొకటి యడుగుచున్నాను. ఏలోకమునందైనను—ఏకాలమునందైనను—ఏకులమునందైనను తన సంపదలు పోయినప్పటికి—అడవుల పాలైనప్పటికి—అవమానముల పాలైనప్పటికి-ఆలుబిడ్డలను గోల్పోయి నప్పటికి—అధమజాతి వాని కొలువు సేయు నీచదశకలిగినప్పటికిని అబద్ధమాడని సత్యశీలుడున్నాడా! ఉన్నయెడల నతడెవ్వడో! చెప్పండి" అని యడిగాడు.

సభలో కూర్చుండియున్న పెద్ద పెద్దలంతా ఒకరిమొగాల నొకరు చూచుకొని మౌనం వహించారేకాని యెవ్వరునూ మాటలాడలేదు. బ్రహ్మదేవుని మానస పుత్రుడయిన నారదముని అసలేజగడాలచీలి. తగవు లేనిచోట

తగవు పుట్టించుటలో వానికాతడేసాటి. ఆయన కాలుబెట్టినచోట నేదోయొక విలయం జరుగకుండా యుండదు. ఆయన ముందుగా లేచి "ఎవరును మాటాడకున్నారు. వశిష్ఠమహాముని! నీవైన చెప్పవయ్యా!" అని పురికొల్పాడు.

వశిష్ఠమహాముని లేచి నిలువంబడి "దేవేంద్రా! పుణ్యభూమి యైనభరతదేశము మీద సత్యసంధులు లేక పోయిరా! ఉన్నారు. తూర్పునందుదయించు సూర్యుడు పడమర నుదయించినా—ఆకాశమందున్న నక్షత్రములన్నీ గలగలమంటూ నేలమీద రాలినా—కుల పర్వతము లేడును దూదిపాయలట్లు తేలికయై గాలిలో లేచిపోయినా—మహాసముద్రములలో నీరింకిపోయి-భూమండలమంతటను సౌరంగముల మయమయినా—మహాప్రళయంబులు వచ్చినగాని ఆడితప్పని సత్యసంధుడు భూలోకము నందున్నాడు. అయోధ్యాపురమునేలు చక్రవర్తి-హరిశ్చంద్రు"డని చెప్పి కూర్చున్నాడు.

వశిష్ఠడంటె విశ్వామిత్రమహామునికి గిట్టదు. విశ్వామిత్రుడు నిజానికి రాజులయింటనే పుట్టాడు. కొన్నాళ్ళు రాజ్యపాలనచేశాడు. కాని రాజాధికారంకంటె తపసుగొప్పదని తలంచినందున పరిపాలించే రాజ్యాన్ని విడిచి గోరమైన తపస్సుచేశాడు. తన తమఃప్రభావంతో బ్రహ్మదేవుని సృష్టికి బదులు సృష్టి గూడాచేశాడు. ఐనా మునికుండదగిన శాంత మాయనలోలేదు. కోపం ముక్కుమీదనే యుంటుంది. హరిశ్చంద్రుడు తనవంశంవారు. తనకులము వాడైన రాజును సత్యమూర్తియని యింద్రసభలో యెలుగెత్తి చాటడం బాగుగనే యున్నది కాని తనకు పగవాడైన యీవశిష్ఠుడు చెప్పినదానికి తలవంచడమా!" అనే అహంభావం పెరిగినందున వానిమాటను కాదని వాదించడానికే తయ్యం బెట్టుకొన్నాడు.

హుంకరించుచులేచి నిలువంబడిన విశ్వామిత్రుడు వశిష్ఠుని వంకచూచి "ఏమోయి! పురోహితపుబ్రాహ్మణుడా! ఏమన్నా వేమన్నావు? హరిశ్చంద్రుడు అబద్ధమాడడా! రాజులకాపాటి నీతినియమములున్నవా! నీవు వారిండ్లలో మంత్రములు చెప్పుకొని బ్రతుకుచున్నావు కనుక వాని యందీపాటి యభిమానం చూపినందుకు సంతోషించాం ఇకమీదనీవిటువంటి చేతగాని మాటలు చెప్పకు" మని బెదరింపులతో యెదిరించాడు.

అంతట వారిద్దరికీ వాదోపవాదాలు జరిగినై. చివరకు వశిష్ఠమహాముని "ఓయీ! నీవా హరిశ్చంద్రునిచేత అబద్ధమాడించి నట్లయితే నేను నాతల నున్నగా గొరిగించుకొని-సున్నపుబొట్లు పెట్టుకొని-గాడిదమీదనెక్కి- ప్రపంచమంతా తిరిగి వస్తా" నని శపథం చేశాడు. విశ్వామిత్రుడుకూడ "నేనా హరిశ్చంద్రుని చేత అబద్ధమాడించలేకపోతే హిమశైలంమీద వేయిసంవత్సరాల కాలం గాలినితింటూ చేసిన నాతపస్సునంతా వానికిధారపోసి వెయ్యేండ్లు స్వర్గలోకం పాలించేలాగా చేస్తా"నని ప్రతిశపథం చేశాడు.

అంతటితో నాటికీ దేవసభ ముగిసింది.

## ముని మాయా ప్రభావము

విశ్వామిత్రుడు తన పంతం చెల్లించుకొనవలసి యున్నది కనుక అయోధ్యానగరానికిపోయి హరిశ్చంద్రునితో "రాజా! నేనొక మహాయజ్ఞం

చేయడానికి తలపెట్టాను. దానికిధనం కావాలి. బలవంతుడైన మనిషి యేనుగు మీదికెక్కి ఒక రతనం మీటితే యెంతెత్తుపోతుందో అంతద్రవ్య మీయ గలవా!" అన్నాడు. హరిశ్చంద్రుడు మహాదాతకనుక "తప్పకుండాయిస్తాను తీసుకొనిపొండి" అన్నాడు. కాని మునీంద్రుడా సొమ్ము పుచ్చుకొనక "నాకిపుడవసరంలేదు. నీయొద్దనే దాచియుంచు, కావలసినపుడు నేనేయడిగి పుచ్చుకుంటా" ననిచెప్పి తిరిగిపోయాడు.

కొద్ది రోజులుగూడ జరుగక ముందు రైతులువచ్చి "మహాప్రభూ? పులులు—ఎలుగులు మొదలైన క్రూరజంతువులు చెలరేగి మాపొలాలలోబడి పైరులు పాడుచేస్తున్నవి—మేకలను, ఆవులను-మనుషులనుగూడ చపుచున్న" వని మొరబెట్టుకున్నారు. హరిశ్చంద్రుడు వారికి నేను రేపేవచ్చి వేటాడి క్రూరజంతువులను చంపి మీభయం తొలిగిస్తా"నని ధైర్యం చెప్పి వారిని తిరిగి పంపించాడు.

మరునాడు హరిశ్చంద్రుడు కొందరు వేటగాండ్రు పరివారం వెంట నుండ సకుటుంబంగా అడవికిపోయి మృగాలను వేగాడి చంపాడు. అటు తరు వాత విశ్రాంతికై భార్యాబిడ్డలతో కూర్చుండి మాటాడు కుంటుండగా యిద్దరు మతంగ స్త్రీలువచ్చి చక్కగాపాడి ముచ్చటకొలిపారు. రాజుగారు వారికి రత్న హారం బహుమతి యీయబోయాడు. కానిమతంగస్త్రీలు "మాకీహారాలొద్దు— మమ్మల్ని పెండ్లాడు"మని కోరారు. హరిశ్చంద్రునికి కోపంవచ్చి వెళ్ళిపొం డని గెట్టించాడు. దానికా స్త్రీలు పెద్దపెట్టున యేడుస్తూ విశ్వామిత్రుని పిలిచారు విశ్వామిత్రముని నిప్పులుగ్రక్కుతూవచ్చి "వీరిద్దరూ నాముద్దుల కుమార్తెలు

పీకని మెడపెట్టిగెంటుదువా! నిన్ను శపింపుతా"నని భయంకరంగా కేకలు వేశాడు.

అంతా అయోమయ మయింది. ఏమైనా హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని క్షమాపణ కోరుకున్నాడు. విశ్వామిత్రుడంతట "సరేరాజా! నేను నిన్ను శపించకుండ మానుకున్నాను. నీవు యీకుమార్తెలను పెండ్లాడు"మన్నాడు. హరిశ్చంద్రుడంగీకరింపక "అయ్యా! నేను నారాజ్యమునైన ఒదులు కుంటాను కాని-వీరిని మాత్రం పెండ్లాడలే"నన్నాడు. ఆ అవకాశం కొరకే విశ్వామిత్రుడింతనాటక మాడాడు కనుక వెంటనే "హరిశ్చంద్రా! రాజ్యమునైన ఒదులుకొంటానన్నావు కద! నీవు మాటదప్పని సత్యసంధుడవైతే నీరాజ్యమంతా నాకిచ్చివేయి" అన్నాడు. పొరపాటున నోరుజారిన నేరానికా మహారాజు తన రాజ్యమంతా మునికిచ్చివేశాడు.

రాజ్యంలేని నీకీరాజదుస్తులు రాజాభరణాలు మాత్రమెందుకు, వానిని కూడ యిచ్చివేయమనిన మునికి వానినిగూడ సమర్పించాడా రాజేంద్రుడు.

విశ్వామిత్రుడప్పుడు "హరిశ్చంద్రా! ఆనాడు నీవునాకు యజ్ఞంకొరకు ధనమిచ్చావు. నేనుదానిని నీయొద్దనే దాచుకున్నాను. ఆసొమ్ముగూడ యీయమన్నాడు" విశ్వామిత్రుడు. హరిశ్చంద్రుడు చిక్కుల్లోబడ్డాడు. ఉన్న రాజ్యమంతా మునికేయిచ్చాడు-యిప్పుడాయన దగ్గర చిల్లికానిలేదు. మహారాజు యోచించి "మహామునీ! నేనేంమిగిలించుకొనకుండా ఉన్న సంపదలన్నీ మీకే యిచ్చానుకద! ఇంకా ఆనాటిసొమ్ము నేనుదాచుకొంటినా!" అన్నాడు. మునీంద్రుడు నిర్మొగమోటంగా "అదంతా నాకు తెలియదు. నీవునాకు సొమ్మివ

దబద్ధమా! నేను నీదగ్గర దాచుకున్న దబద్ధమా!" అని మెలిక బెట్టాడు. ఎటూ కాదనలేని హరిశ్చంద్రుడు "స్వామీ! పొరపాటు పడ్డాను. దయయుంచి నా కొక నెల గడువిప్పించండి. మీబాకీ తీర్చుకుంటా"నని వేడుకున్నాడు.

ముని సరేనంటూ "నీవు నెలదాటకుండా మాసొమ్మంతా యిచ్చితీరాలి. బాకి రాబట్టుకొనడానికి మాశిష్యుని నీవెంట పంపుతాను. వానిచేతికా ధనమిచ్చి పంపించుమం"టూ తన శిష్యులలోనివాడైన నక్షత్రకుని పిలిచి వానితో రహస్యంగా "శిష్యా! మనకు కావలసింది నిజానికి ధనంకాదు. నేనానాడు దేవేంద్రసభలో చేసిన నాప్రతిన చెల్లించుకొనడానికి యితనిచేనబద్ధమాడించాలి. అందుకేయింత నాటక మాడిస్తున్నాను. నీవెన్ని తిప్పలు బెట్టియైనా యతనిచే నబద్ధమాడించు. నేను మీకెవరికి కనపడకుండ మీవెంటనేయుండి అంతా చూస్తుంటా"నని చెప్పి హరిశ్చంద్రుని వెంట పంపించాడు.

# హరిశ్చంద్రుని సత్యపాలన

హరిశ్చంద్ర చక్రవర్తి అంత మహాప్రభువు యిపుడు తింటానికన్నము-కట్టడానికి బట్టా-నిలచుండడానికి నీడ గూడ లేకుండ పోయినై. పైగా అప్పుబాధ పైన బడింది. దానిని రాబట్టు కొనడానికి యింకొక ముని కుమారుడు వెంబడించు చుండగా భార్య చంద్రమతిని-కుమారుడు లోహితాస్యుని వెంట బెట్టుకొని అడవుల పాలయ్యాడు. కాశికి ప్రయాణమయ్యాడు.

దారిలో నక్షత్రకుడు వారిని పెట్టిన బాధలు బాధలు కావు. విశ్వామిత్రుడు కూడ రహస్యంగా దాగి యుండి యెప్పటి కప్పుడే యెన్నెన్నో ప్రమాదాలను కల్పిస్తున్నాడు. భయంకరమైన మంటలు మండి వారిని చుట్టి ముట్టినై—దయ్యాలు భూతాలు వారిని బాధించినై—ఆకలి దప్పికలతో అలమటించారు. అడుగడుగునా వానిచేత అబద్ధ మాడించడానికి యెన్నో యెత్తులు వేశాడు నక్షత్రకుడు—కాని ప్రయోజనం లేకపోయింది.

హరిశ్చంద్రు డన్నింటికి ఓర్చుకుని కాశీనగరం చేరుకున్నాడు.

అప్పటికి తాను మునికి పెట్టిన గడవు నెల సరిపోయింది.

నక్షత్రకుడింక "మాసొమ్మిచ్చెదవా! లేదా!" యని పట్టుబట్టాడు. హరిశ్చంద్రు డేమీ చేయలేక కాశీనగరంలోనే కాలకౌశికుడనే బ్రాహ్మణునికి తన భార్యను కుమారుని అమ్మి ముని బాకీ యిచ్చాడు. కాని నక్షత్రకుడంతటితో వానిని విడిచి పోకుండా "నేనీ నెలంతా కష్టపడి నీవెంటబడి తిరిగాను—యిపుడు నీవు నాకిచ్చిన దంతా నేను నాదారికర్చుల క్రింద వాడుకుంటున్నాను. నీవా మునికీయవలసిన బాకీ మాట యేమిటి?" అని అడ్డం తిరిగేడు. రాజు వానికి సమాధానం చెప్పలేక తాను వీరబాహుడనే కడజాతి వానికమ్ముడు పోయి మళ్ళీ విశ్వామిత్రుని ఋణం తీర్చాడు. అప్పటితో హరిశ్చంద్రునికి నక్షత్రకుని పీడ వొదిలింది.

అంత సత్యవంతుని—శాంతమూర్తిని—ధర్మపరుని యిన్ని బాధలు పెట్టిన పాపం తన్నెట్టులు పీడించు తుందో నన్న భయంతో నక్షత్రకుడు

తీర్థయాత్రలు చేయడం మొదలు పెట్టాడు. గురువుగారి సొమ్ము గురువు గారి కప్పగించి తాను తపసు చేయ బూనాడు.

వీరబాహు డిక్కడ హరిశ్చంద్రునికి వీరదాసు అని పేరు పెట్టి "నీవు నాసేవకుడివి కాబట్టి, కాటికాడ కాపుండాలి. శవాలను కాల్చడానికి వచ్చిన వారిదగ్గర వచ్చే మామూలుతో కూడ డబ్బులు నాకు తెచ్చియ్యాల. వాళ్ళిచ్చే బియ్యం నువ్వొంతుకొని తినాల. పతిరోజు తెల్లారేసరికి యీ కుండ నిండా కల్లు నింపుకొని తెత్తుండాల" అని నియమించాడు. రాజు మారు మాటాడ కుండ అన్నిటికి సరే నన్నాడు.



చంద్రమతిని కొనియింటికి తీసుకపోయిన కాలకౌశికుని భార్య కలహకంఠ. ఆమె గయ్యాళిగంప. కలహకంఠ చంద్రమతికి హంసనారి అని పేరు పెట్టింది. నానాతిప్పలు బెడుతూంది. ఆమె అనే సూటుపోటుమాటలకు చంద్రమతి హృదయం గాయాలు పడిపోతూంది. ఐనా భరించుకొని కాలం గడపుతూంది.



ఒకనాడు కాలకౌశికుడు మునికుమారుల వెంట లోహితాశ్యుని గూడ దర్భలు కోసుకరమ్మంటూ అడవికి పంపించాడు. అడవికి పోయిన లోహితాశ్యుని పాము కరచింది. మునికుమారులు తిరిగివచ్చి "అమ్మా! చంద్రమతీ! నీకుమారుడు పాముకరచి చనిపోయా"డని చెప్పారు. చంద్రమతి విలపించి పోయింది. యజమానురాలి యాజ్ఞప్రకారం యింటిలో పనులన్నీచేసి రాత్రి వేళ చీకటిలో అడవికి పోయి ఆచీకటిలో వెతికింది. ఆమెకు లోహితుని కళేబరం దొరికినందున దానిని దహనం చేయడానికి ప్రయత్నించింది. కుమా

రుని బుజానవేసికొని కాటికిపోయి అక్కడ చుట్టుప్రక్కలనున్న కట్టెలను చేర్చి వానిమీద లోహితుని పరుండ బెట్టింది.

అదిచూచి వీరదాసుని రూపంలోవున్న హరిశ్చంద్రుడు చంద్రమతిని "నీవుమాకు కాటిసుంకము నీయక శవమును కాల్చరా"దని ఆటంకపరిచాడు. "అయ్యా! నాదగ్గర నేమీలేదు. నేనొక నిరుపేదరాల"నని తనగోడు చెప్పు కుంది. కొంతసేపటికాయన ఆచనిపోయిన బిడ్డ తనకుమారుడు లోహితుడని- ఆమె తనభార్య చంద్రమతి యనిన్ని తెలుసుకొని యెంతగానో చింతించాడు. ఐనప్పటికి తనధర్మాన్ని తాను తప్పగూడదనుకున్నాడు. తనకు మిగిలే బియ్యపు లేకపోయినా మంచిదేకాని యజమాని కీయవలసిన మాడదబ్బులు లేకుండ శవదహనం చేయడం సేవాధర్మం కాదుకనుక చంద్రమతిని నీవు పోయి నీయజమాను రాలినడిగి మాడ డబ్బులు తీసుకొని ర"మ్మని పంపిం చాడు.

కానిదారిలో దైవికంగా చంద్రమతిమీద ఒకనేరం వచ్చిపడింది. రాజుగారి కుమారుని చంపి ఆ భరణము లపహరించిన దొంగలా సొమ్మును చంద్రమతిమీద పడవైచి పారిపోయారు. రాజభటులు వచ్చి చంద్రమతినే దోషిగా పట్టుకొనిపోయి రాజుగారి ముందుంచారు. రాజామెకు మరణదండన విధించారు. రాజామెను చంపడానికి తలాదులచేత వీరబాహుని దగ్గరకుపంపిం చారు. వీరబాహుడా పని తన సేవకుడైన వీరదాసును నియమించాడు. హరి శ్చంద్రుడిపుడు తన చేతులతో తనభార్య గొంతు నరకవలసి వచ్చింది.

సత్యపాలనకై హరిశ్చంద్రు డందులకుగూడ సాహసించాడు.

ఆయన ధైర్యానికి—సాహసానికి మెచ్చుకొనిన విశ్వామిత్రుడు వచ్చి జరిగినదంతాచెప్పి లోహితాశ్యుని తిరిగి బ్రతికించాడు. వారిరాజ్యం వారి కిచ్చాడు. తన తపస్సులోసగం హరిశ్చంద్రునికి ధారపోశాడు. దేవతలు పూల వానలు గురిపించారు. ప్రపంచమంతా హరిశ్చంద్రుని సత్యశీలుడని ప్రశం సించింది.

# భవనాశనీ పుష్కరిణీ మహాత్మ్యము

నక్షత్రకుడు హరిశ్చంద్రుని యిన్ని బాధలుపెట్టి, భార్యాబిడ్డల నమ్మించి, వానిని కడజాతివానికమ్మి ధనం సంపాదించిన పాపఫలంబున కుష్ఠిరోగి యయ్యాడు. వానిశరీరంనుండి సహింపరాని దుర్గంధం రాసాగింది. అతడు కన్నుమూసినా, తెరచినా దయ్యాలు భూతాలు కనపడి భయపెడు చున్నవి. మతిభ్రమించి కేకలుపెట్టడం పరుగులెత్తడంతో పిచ్చివాడయ్యాడు ఎవరైన వానిని దగ్గరకు తీసి ఆదరింపవలయుననిన వాని కుష్ఠువ్యాధి యెవ రినీ దరిజేరనీయడంలేదు.

వాని స్తితిచూచి విశ్వామిత్రునికి జాలికలిగింది.

నక్షత్రకుడు బ్రాహ్మణుడు. బ్రహ్మచారి. గురువుగారి మాట ప్రకా రంబున హరిశ్చంద్రుని నానాబాధలు పెట్టినా తన స్వార్థానికి మాత్రం కాదు. కావున వానిని కాపాడడం తన ధర్మమనుకున్నాడు. మిగిలిన తన శిష్యుల నందరను రావించి "మీరీతనిని గొనిపోయి నరసింహస్వామి క్షేత్రము నం దున్న భవనాశినీ పుష్కరిణిలో స్నానం చేయించుక రండి. మీకు నాతపః ప్రభావం వలన వీని కుష్ఠువ్యాధి ఆసాదింపదు. మీకంటి కితడు భయంకరం బుగ కనపడ"డని నియోగించాడు.

మునికుమారు లంతట నక్షత్రకుని బలవంతముగ గొనిపోయి భవనాశినీ పుష్కరిణిలో స్నానం చేయించినంతనే వాని దేహమునందున్న వ్యాధి యంతయూ మాయమైపోయి సుందరదేహం కలిగింది. ఆయనకు గత విషయములుగూడ స్ఫురణకు వచ్చినవి. మనసుస్థిమిత పడినందున తోడివారలతో "మిత్రులారా! మీకు వందనములు. గురువుగారి యనుమతి ప్రకారంబుగ మీరందరు పట్టుబట్టి నన్నుగొనివచ్చి పుష్కరిణిలో స్నానం చేయించి నందుననే తిరిగి మనిషినయ్యాను. ఈభవనాశినీ పుష్కరిణి మహాత్మ్యము గొప్పదని మనం తెలిసికొన్నాం.

ఇది నరసింహస్వామి వేంచేసియున్న పుణ్యస్థలంకదా! దైవదర్శనం చేయుటయు మంచిదనగా వారందరును స్నానములు చేసి లక్ష్మీనరసింహస్వామికి ప్రదక్షిణములు చేసి భక్తి ప్రపత్తులతో పూజించి రాత్రికచటనే నిద్రించారు. నరసింహమూర్తి వారి స్వప్నములలో కనపడి "భక్తులారా! నా క్షేత్రమందలి భవనాశినిలో స్నానమును చేసిన మీరందరు మీమీ జన్మజన్మలలో చేసిన పాపముల నుండి విముక్తి పొందితిరి. నన్ను దర్శించి ప్రార్థంబనందున నేనుమీకు ప్రసన్నుండనైతిని. మీరీ ప్రపంచమున కొంతకాలము సకల భోగముల ననుభవించిన తరువాత మీకునేను విష్ణుసాన్నిధ్యము నిచ్చుచున్నా"నని చెప్పి యదృశ్యమయ్యాడు.

మరునాటి యుదయం మేల్కాంచిన మునికుమారులా నరసింహస్వామికి మ్రొక్కి స్థలమాహాత్మ్యమును కొనియాడుచూ తిరిగి వారి స్థానాలకు పోయారు.



